Reg No M 757

శ్రీ

# అభినవ సరస్వతి

యనునొక మాసపత్రిక.

అష్టావధాని జనపాటి పట్టాభిరామశాస్త్రిచే

ప్రచురింపఁబడుచున్నది.

గుంటూరుజిల్లా, పల్నాఁడుతాలూకా, జానపాడు.

సంపు 3.] 1911 సం॥ మార్చి, ఏప్రియల్ [సంచిక 3-4.

విషయములు.

---



చందా నిర్ణయము సంవత్సరమునకు.

| | | | |
|---|---|---|---|
| ప్రధానపోషకులు | రు 25-0-0 | సహాయులకు | రు ౫-0-0 |
| పోషకులకు | రు 10-0-0 | చందాదారులకు | రు 2-0-0 |

భారతీవిలాస ముద్రాక్షరశాల, నర్సారావుపేట.

Printed at the Bharathi Vilasa Press,
Narasarowpet, And published at Janapadu
by the Editor Astavadhani
Janapati Pattabhirama Sastry.

1911

ఈసంవత్సరముచందా యిచ్చిన—

## స హా యు లు

1 తంగెడ నరసింహారావుగారు, కరణం, మోర్జంపాడు.

2 పిరాట్లసీతాకాంతంగారు, చింతపల్లి.

3 పిరాట్ల సత్యనారాయణగారు, చింతపల్లి.

4 కొప్పరాజుగురుచంద్రశేఖరరావుగారు ఫారెస్టుగార్డు, మేళ్లవాగు

ఇవ్వవలసినవారు—

5 సూరిదేవర సుబ్బానాయుడుగారు, తుమ్మపూడి.

6 తుమురుకోటి నరసింహరావుగారు, తిరుమలగిరి.

7 తడిసిన రామధర్మారెడ్డి దేశముఖుగారు, కొమ్మెడ.

8 కాకుమానుహనుమయ్యగారు, నర్సారావుపేట.

9 రాజశేఖరుని లక్ష్మీనారాయణగారు, కరణం, చిట్యాల

10 కంచర్లలక్ష్మయ్యగారు, ఫారెస్టుగార్డు డిటో

11 కోలాపిచ్చిరెడ్డిగారు, గ్రామమునసబ్, దాచేపల్లి

12 గోపాలునిరామలింగయ్యగారు,ముప్పాళ్ల.

13 వెలుగూరి పిచ్చయ్యగారు, పెదకొదమగుండ్ల

14 సైషధంసీతాకాంతంగారు, మోరంపూడి.

15 ఘడియారం వెంకటశివశాస్త్రి గారు, సంగంజాగర్లమూడి

16 శేకూరి వెంకటకృష్ణయ్యగారు, కరణం, శేకూరు

17 నూతక్కినరసింహ నాయుడుగారు, విలేజిమునసబ్, మందడం

18 బూదరాజువెంకటసుబ్బయ్యగారు, కరణం, స్వర్ణ.

19 ఏలేశ్వరంవెంకటసుబ్బారావుగారు వకీలు,సిద్దిపేట

20 కలవలపల్లిరంగయ్యశాస్త్రిగారు,భాష్యాచార్యులు, ఏలూరు

21 మంచిళ్ళ నారాయణరావుగారు, కంభంపాడు.

22 గుజ్జాల వెంకటరెడ్డి దేశముఖుగారు, గుండవరం.

23 గంభీరరావుదేశాయిగారు, లింగన్నపేట.

24 సైదు ఖాసింసాహెబుగారు, ఫారెస్టుగార్డు, చింతపల్లి

శ్రీమత్.

# అభినవసరస్వతి.

—:o:—

[ఇది మాసమున కొకసారి ప్రచురింపఁబడును.]


| సంపు 3 | జానపాడు.<br>సాధారణ ఫాల్గుణము, విరోధికృచ్చైత్రము. | సంచిక<br>3-4 |
|---|---|---|


హిందూ వార్తాపత్రికనుండి భాషాంతరీకరణము.

## THE CENSUS.

### జనాభా,

అశేష హిందూదేశ జనసంఖ్య 315001099 ఐయున్నయది. దీని బట్టిచూడఁ గడచిన జనాభాకన్న 100-కి 7 రు వంతున జనాధిక్యము గన్పట్టుచున్నది. బ్రిటిషువారి స్వయంపరిపాలనలోనున్న హిందూదేశపు జనులమొత్తము 244172371 హైదరాబాదా మైసూరు మొదలగు సంస్థానములయొక్కయు, మన్నెములయొక్కయు జనసంఖ్య 70828728 ఐయున్నది. బ్రిటిషురాష్ట్రములలోనెల్ల మధ్యరాష్ట్రములలోను బీహారునందును విశేషముగ జనాభివృద్ధిగల్గినది. పిమ్మట బర్మాయుఁదూర్పుబంగాళమును, అస్సామును మనచెన్నపట్టణమును బొంబాయియును వంగదేశమును జనాభివృద్ధింగాంచునవిగానున్నవి. మహామారి (బొబ్బలజాడ్యము) మన్నెజ్వరములవలనఁ బంజాబునందునుసంయుక్త (యునైటెడు) రాష్ట్రములయందును 100-కి 10 వంతున క్షీణించుటచేతఁదక్కువగన్పట్టుచున్నది. ఈ సంబంధమున మనము తెలిసికొనఁదగిన విషయమేమనఁగా స్త్రీపురు

షులయభివృద్ధియొక్క తారతమ్యమేమైయున్నది. 1000-కి954చొప్పుననున్న స్త్రీసంఖ్య 1881 వ సంవత్సరమునుండి దినదినాభివృద్ధిఁగాంచుచు 1901వ సంవత్సరముదగ్గరనుంచి పురుషసంఖ్యాపేక్షయాతగ్గసాగెను. ఈయభివృద్ధికెట్లుభంగముకలిగెనఁగా మనభరతఖండంబునఁ బాశ్చాత్యదేశములందలి స్త్రీలయనుభవములోని యారోగ్యప్రదమగు నేర్పాటుసరిగా లేకుండుట చేతనేకాని యితరకారణములెవ్వియుఁగాన్పింపవని తెలియుచున్నది.

అయ్యదెట్లనిన. జనులుకొందఱు స్త్రీశిశువుల శ్రద్ధతోఁ బోషింపకుండుటవలనను నతిబాల్యవివాహములవలనను బాల్యమందే స్త్రీలుబిడ్డలఁగనుటవలనను నేర్పరితనములేనిమూఢురాండ్రు మంత్రసానులగుటవలనను హీనజాతిస్త్రీలు మిగులదుర్ఘటమగు శరీరపరిశ్రమఁజేయుటవలనను నిట్టిస్త్రీల సంఖ్యాభివృద్ధికాటంకం బాసన్నంబాయెను.



నేను కంసాలులమీఁదఁ జేసిన దావా యాథార్థ్యము తెలిసికొనఁగోరి పలుమంది నాకు వ్రాయుచుండుటంబట్టియు బహుకాలము గడచి యీదావా గుంటూరుడివిజన్ డిస్ట్రిక్టు మున్సిఫ్కోర్టుకుఁ ట్రాన్సుఫరై త్వరలో విచారింపఁబడఁబోవుటంబట్టియు నీ క్రింద నా తప్సీలంతయు ప్రకటించుచున్నవాఁడను.

పత్రికాధిపతి.



నరసరావుపేటలో సాధుజనాగ్రేసరులగు అధరాపురపుఁ బురుషోత్తమాచార్యులుగారు శ్రీరామనవమినాఁడు శ్రీరామునిలో నైక్యమయిరి. వీరిఁగురించిముందువ్రాయఁబడును.

అ-నెం 984-07 గు

మహారాజరాజశ్రీ నరసరావుపేట డి_స్త్రిక్టుమునసబు
కోర్టువారిసముఖమునకు

వాది-జానపాటిపట్టాభిమశా_స్త్రి-ప్రతివాదులు-వ్రాలేటిలక్ష్మయ్యవ॥

సివిల్ ప్రో॥ 50 శెక్షన్ ప్రకారము వాదితరఫు దాఖలు చేయఁబడిన
ప్లెయింటు.

1. వాది బ్రాహ్మణులు జీ॥ భూములు వగయిరా. జానపాటి లక్ష్మినారాయణగారికుమారుఁడు పట్టాభిరామశాస్త్రి. వయస్సు 33 సం॥ సా॥ పల్నాఁడు తాలూకా జానపాడు.

2. ప్రతివాదులు కంసాలులు. జీ॥ వడ్రంగమువగయిరా. 1 వ్రాలేటి బసవాబత్తునికుమారుఁడు లక్ష్మయ్య. వ॥ 60 సం॥ 2సం దిగాము పరమయ్య కు॥ కాశీపతి. వ॥ 50 సం॥ 3 ఈ పేరయ్య కు॥ చినబ్రహ్మం. వ॥ 40 సం॥ 4 సిరిపురపు భద్రయ్య కు॥ భిక్షాపతి. వ॥ 50 సం॥ 5 బుజ్జూరు పాపయ్య కు॥ మల్లయ్య. వ॥ 40 సం॥ సా॥ 1 బెజవాడ కోర్టిలూకా నందిగాము తా॥ వల్లిసివారు క్రొత్తపాలెము. 2-3-4-5 జానపాడు.

3. పల్నాఁడుతాలూకా జానపాడుగ్రామములోఁ బోలేలమ్మ పాతపాటమ్మల దేవాలయములు రెండున్నవి. ఆదేవాలయములలో మూలవిరాడ్విగ్రహములు చిరకాలము క్రింద బ్రాహ్మణులచేఁ బ్రతిష్ఠింపఁబడి తత్కారణముచే సన్ని వర్ణములవారిచేతను సేవించుటకు యోగ్యములై యట్లుసేవింపఁ బడుచుండెను. తద్విగ్రహములు శిథిలములై పూజానర్హములై యుండఁగానిప్పటికిషుమారు 4 యేండ్లక్రిందట వాదివగయిరా బ్రాహ్మణులును వైశ్యాదులును దేవాలయములలో శాస్త్రప్రకారముగాఁ దిరిగి విరాడ్విగ్రహముల బ్రాహ్మణులచేఁ బ్రతిష్ఠింపఁ జేసియున్నారు. అందువలనఁజతుర్వర్ణముల వారిచేతను సేవింపఁబడు చుండెను. ఐతే 190:న సంవత్సరము జులై

22 వ తేదీని ప్రతివాదులు కొందఱు జతుర్థాదులను దోడ్పాటు చేసి కొన్ని దేవాలయములోని దేవతలకు దిరిగి సంప్రోక్షణలను నెపముతో మహాంగల్యములు జరిపి యిందుమూలముగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్యవర్ణములకు దేవాలయము లసేవ్యములుగాఁ జేసి సదరు 3 వర్ణముల వారికి నష్టము గలిగించిరి.

4. అట్టిపైని వాది గ్రామములోని బ్రాహ్మణబృందముతరఫున గురిజాల స్టేషనరి సబ్ మేజస్ట్రేటుకోర్టులోఁ బ్రతివాదులు నగయిరాలమీఁదఁ జార్జీదాఖలు చేయఁగాఁ జార్జి చేయఁబడి కొన్ని కారణములచే సివిల్ తగాదాయని ముద్దాయిలు విడుదల చేయఁబడిరి.

5. ప్రతివాదులు ద్విజాతులలోఁ జేరని యగసాలవృత్తి కంచర కమ్మర కాసెవృత్తులు గలవారిలోని వారు. వర్ణసంకరజాతి వారైనందున యాజనాది కర్మల కనధికారము గలవారు. ప్రతివాదులు జరిపిన యశాస్త్రీయచర్యవలనఁ గలిగిన నష్టమును నివర్తి చేయుటకుఁ బరిహారముఁ బొందుటకు దావా తేఁబడినది.

6. వ్యాజ్యకారణము. ప్రతివాదులు సంప్రోక్షణఁ జేయుటమూలముగా బ్రాహ్మణాదులు సదరు దేవాలయములయందుఁ బూజలు భోజనములు చేయకుండఁ జెల్లించకుండఁ (Prafane) చేయఁబడిన 1906 వ సం॥ జులయి 22 వ తేదీని సదరు దేవాలయములును 2-3-4-5 ప్రతివాదులును నుండిన తమకోర్టువారి జూరిస్డిక్షనులోఁ గలిగినది.

7. దావావిచారము ప్రతివాదు లక్రమముగా జరిగించిన 4 వ పేరా దాఖలా చర్యవలన వాదినగయిరాలకే యైననష్టము (అనఁగాఁ దిరిగి 2 ఆలయములయందుఁ బ్రతిష్ఠలకగు ఖర్చులు) రు 190-0-0 లును దావా దేవాలయములలోఁ బ్రతివాదులు సంప్రోక్షణ నగయిరాలు తాముగాని తమజాతివారితోఁ గాని చేయించకుండ శాశ్వతమయిన యింజక్షన్ పరిహారమునకుఁ గిమ్మతురు 10-0-0 లును వెరసి 200-0-0 లు సదరు రు 200-0-0 లకుఁ దగినమైన స్టాంపుడ్యూటీ దాఖలు చేయఁబడినది.

కాఁబట్టి విమర్శించి

(a) దావాదేవాలయములయందు విగ్రహ ప్రతిష్ఠాదులకు వాదివగయిరా బ్రాహ్మణులకే హక్కుగలదని నిర్ధారణఁజేయించు టకును బ్రతివాదులు, తాముగాని తమజాతివారితోఁగాని ప్రతిష్టలు చేయించుటకు హక్కుగలవారుకారని తీర్మానించుచు వాదికిరివపే రాందాఖలాయయినసష్టము రు 100-0-0 లు ప్రతివాదులనుండి వాదికిప్పించుటగాను దావా దేవాలయములలోఁబ్రతివాదులు సంప్రోక్షణనగయిరాలు తాముగాని తమజాతివారితోఁగాని చేయించకుండ శాశ్వతమైన యింజక్షన్ దయచేయించుటకును.

(b) ఈదావాఖర్చులిప్పించుటకును

(c) ఇంకనుగోర్టువారికి యుక్తమునియును న్యాయమనియు తోఁచెడి సకలేతరపరిహారములును దయచేయించుటకును సదరుపరి కారము వాదికిఁబ్రతివాదులమీఁద డిక్రీదయచేయించ వలయునని వాది మిక్కిలిప్రార్థించుచున్నాఁడు.

షరా:—గ్రామములోని బ్రాహ్మణబృందముతరఫున వాది యొక్కఁడే యీదావా తెచ్చుటకు బర్మిషన్ పిటీషన్ దీనితో దాఖలు చేయుటయైనది. ది 24-9-07

ఆన్సరు.

సివిల్ ప్రొ॥ కో॥ 110 సె॥ ప్రకారం ప్రతివాదులుదాఖలు చేసిన స్టేటుమెంటు.

1. దావాంశములలోఁ గొన్నికల్పితములు- దావాశాస్త్రప్రకారము నిలువఁజాలదు.

2. జానపాటిగ్రామములోని బ్రాహ్మణులందఱికి నీదావాతో సామాన్యసంబంధయోగ్యములు (Same interest) లేవు. అట్టిచో వారందఱితరఫుముక్తము వాదియొక్కఁడే దావా తెచ్చుటకర్హుఁడుకాఁడు.

3 ప్రోలేలమ్మ పాతపాటమ్మలు బ్రాహ్మణారాధ్యములుకావు. ఆదేవతలకు నిత్యనైవేద్యదీపారాధనలు లేవు. కొలుపులయందుమాత్ర

ము శూద్రులా దేవతల సమాంత్రకముగనెన్నంతురు. దావాయాల యములయందలి దేవతలకు సంప్రోక్షణచేయలేదు- విగ్రహములు శిథిలములగుటచే గ్రామస్థులకోరిక ననుసరించి ప్రతివాదులు నూతన విగ్రహములను బ్రతిష్ఠించిరి. వానిని ప్రజలు యథాప్రకారముసేవించుచున్నారు.

4. విగ్రహప్రతిష్ఠగాని తక్కినయాజనాదికర్మలుగాని చేయుటకుఁబ్రతివాదులకు సంపూర్ణమయినహక్కుగలదు. ఇందుఁగూర్చి ప్లెయింటు 6వ పేరాలో వాదివాక్రుచ్చిన నీచవచనముల నిందు ఖండించుట యప్రస్తుతముగావున విస్తరించలేదు.

5. దావాయాలయములయందుఁ దిరిగిప్రతిష్ఠలజరుప నవసరములేదు. అవసరమున్నట్లు కోటుగారభిప్రాయపడినను సంతకు రు 100లు ఖర్చుకాదు.

6. వాదికిఁగాని తక్కినబ్రాహ్మణులకుఁగాని లేశమయినను నష్టముకలుగలేదు. వాదికోరిన యింజంక్షన్ గాని యేయితరపరిహారముఁగాని వాదిపొందఁదగదు.

కాఁబట్టి వాదిదావాఖర్చులు పరిహరింపవలయునని ప్రతివాదులు ప్రార్థించుచున్నారు.

ప్రతివాదులసంతకములున్నవి

## సా రాం శ ము లు.

1 వాదియు వాదివర్ణపు నితరజనులును మాత్రమె దావాదేవాలయములలోనుండు విగ్రహములకుఁ బ్రాణప్రతిష్ఠఁ జేయుటకు హక్కుగలవారా?

2 ప్రతివాదులు తిరిగి 1906 సం॥ లో నట్టిప్రతిష్ఠఁ జేయుట వలనఁగూడనిపనిఁజేసినారా?

3 దావాలోఁ గోరఁబడిన యింజంక్షనును నష్టమునకును వాదికిహక్కున్నదా?



ఆ॥వె॥ అలఁతియంచుఁ దలఁచి యచ్యుతు కరుణచే । వలఁతి యాచు సత్యభామ యలిని
పాలఁతి యైన; నరకుగళమున రక్తంబు । గలఁతియుజల మనఁగఁ గారఁ జేసె॥

ప్రకా—గలఁతియ॥ అనఁగా గిండిచెంబు గాదు! అంత మాఱుమూలపద మానమచు మునకు జ్ఞప్తికిఁ దగులుట వేనోళ్ళ శ్లాఘింప వలయును. పిఠాపురపువారి యవధానమున నట్టికష్టపుఁబ్రశ్నలు లేవా

శశి—ప్రశ్నలుండ కేమి యెవరేని యడిగినను వీరు చెప్ప మని మొరాయించి వదలి వేయుదు రన్నట్లు మొదటిపీఠికలోనిపంక్తులు చెప్పుచున్నవి నీవీపుస్తకము కొనుటయే గాని చదివినట్లే తోచదే!

ప్రకా—పోనిమ్ము రుచించకచదువలేదు ఇంకనుగలతారతమ్యములనుజెప్పుము.

శశి—ఇదినఱకుఁ గలతారతమ్యము చాలదా! తక్కినప్రసంగము మొదలైనవి లెక్కయేమి అందును గలవు ఇందునుగలవు ప్రధానము కవనము అది యెట్లున్నదో తెల్పితిని వలసినచో నీకఁ నొకపద్య ముదాహరించెద వినుము.

స్తంభమునుండి నరసింహస్వామి పుట్టుట.

“శా॥ జంభాలంభనముఖ్యస్వశ్చరుల నిచ్చల్ బాధ నొందించుటన్
గంభీరాత్మునిఁ బుత్రు డింభకుని దుర్గర్వోక్తి వేధించుటన్
అంభోజాక్షుఁడు శ్రీనృసింహుఁ డన దైత్యాధీశ్వరున్ గూల్పఁగా
స్తంభంబందునఁ బుట్టినాఁడుచుమి సుస్వాంతా! భుజంగాగ్రణీ.

ప్రకా—ఈపద్యము ప్రాసవిషయమున నాశువులోఁ గష్టమవి చెప్ప నొప్పను. ధార బాగుగా నున్నది. అనుకొన్నయర్థ మిమిడినది. కాని స్వశ్చర అన్నచోటను, వేధించుటన్ అంభో, అన్నచోటను గొంచెము దోషము తగిలినది, పైగా తుదనున్న సంబోధన మంత బాగుగ లేదు.

శశి— నీవు చూపినదోషము లున్నమాట సత్యమే ఆవికవులు విద్వాంసులుగా రను నంశమును సూచించుఁగాక. అదిగాక రెండవదోషమునకుఁ గొందఱి యుదాహరణములు గూడఁ గలవు వలసినచో రసమంజర్యాదులు చూడఁబడుఁగాక. తుది సంబోధనము గోరినవారి పేరు కా వచ్చును.

ప్రకా — ఈశొంపురపుంగవులను దిరుపతి వేంకటేశ్వరు లొప్పికొనియుండరా!

శశి — శక్తియున్నప్పుడొప్పికొనకయున్నఁ దీఱునా! వారొప్పికొనకున్న వారితాత మఱియొక రొప్పికొందురు. మొదట నుదాహరించిన పద్యము వారిశిష్యులు చెప్పినదియే ఆయనగూడ నవధానము చేయువారే.

ప్రకా — అందులకా! "మాతిరుపతి వెంకటేశ్వరులు" అని ప్రయోగించినారు. కావున నే కాఁబోలు నంతగా వారిని బొగడినారు, తెలిసినది.

శశి — తెలిసినదికదా! వేంకటరామకృష్ణకవులును వారింగూర్చి శ్రీయేనాపు వెంకటేశ్వరుఁడు సాక్షిగాఁజేసిన చిన్నయవధానములో —

ఉ. ప్రాకటసత్కవిత్వపరిపాటిని మేటిసభాంతరమ్ములన్।
వీఁకశతావధానములు వేలకు వేలొనరించి యందు ము।
క్కాకలు దీరినట్టికవిగండఁడు వేంకటశాస్త్రి యుండఁగా।
(మాకవధానపుంగృతికి మానసమందుఁ దలంక నేటికిన్॥)

అని నుతించి యున్నారు.

ప్రకా — (పుస్తకమును గైకొనిచూచి) ఈ (83) వ పుటలో నున్న యేనాముశతావధానములో నీపద్యము కనుపట్టదేమి!

శశి — గౌరవభంగ మగునని కాఁబోలును దానిని ముద్రణమునఁ దొలగించి రని వినికి,

ప్రకా — సరే యింతకును తేలినసారము, పిఠాపురపుంగవులును ప్రభాకరశాస్త్రిగారి వలెనే తిరుపతి వెంకటేశ్వరులకు శిష్యు లని తేలినది, కావున నీపొగడికయు వారికి గౌరవాపాదకము గా నేరదు.

శశి — కలి పోసినను నుట్టిపంక నే చూచిన ట్లింకను వారికి శిష్యులే యన మొదలు పెట్టినావు. అట్లేని వారిశతావధానసారమును జూడుము. వారింగూర్చి రెండ తెన్నిభాసలలో నెన్నివిధముల వ్రాసి యున్నారో!

ప్రకా — ఈవ్రాఁతలకేమి. ఇవి వీరే కల్పింపఁగూడదా!

శశి—— అష్టైని యొకసారి వారిం గలిసికొని వానికిఁ దగినయాధారములను జూపుఁ డని యడుగుట యొప్పుఁగదా.

ప్రకా——అష్టైఁజేయుందము కాని పిఠాపురపువారి దింకొక యష్టావధాన మున్నటు లున్నది చూతుము.

శశి—— (చూచి) ఈ యొనుబదియొకటవ పుటలోని యవధానము వెనుకటి దానికన్నను దగ్గి "నానాంటికిఁ దీసికట్టు నాగంభట్టూ" అయినది. ఇందుఁగవనమంతయుఁ గలిపిన మూఁడుపద్యములు గాఁ దేలినవి. నిషిద్ధాక్షరి యొకటి చెప్పినట్టు వ్రాసికొన్నను నచ్చ్యది బొత్తిగాఁ బనికిరాక కాఁబోలు నుదాహరించ లేదు. భూతపూర్వపుగతిచే దానింగూడఁ జేర్చికొన్నచో వెరసి నాలుగు, అందులో నొకకోతిసమస్య యున్నది. తక్కినవి రెండుకందపద్యములు. ఆరెండును నొకటే విషయమును బోధించుచున్నవి.

ప్రకా——కోతిసమస్యను జదువుము.

శశి—— చదున నక్కఱ లేదు. అదియును జెడినది.

ప్రకా——దేశమాత యుదాహరించిన యవధాన మిదియా! వెనుకటిదా!

శశి—— రెండునుగావు. అదియింకను నచ్చుగా లేదు. ఏదియెట్లున్నను నొకవిశేషము మాత్రముకలదు.

ప్రకా——ఏమి టావిశేషము.

శశి—— ఏమా? వారిశతావధానమునకు శ్రీవారు అత్యద్భుతబిరుదమును గటాక్షించి యున్నారు. ఇక రేపో నేఁడో శ్రీ సెక్రెటెరీగా రష్టావధానమునకుఁ గూడ నత్యద్భుతపుబిరుదునీయ నున్నారని వినికి, ఈ కొప్పరపువారి యవధానముల కెవరేమి బిరుదుల నిచ్చిరి.

ప్రకా——ఈయ కేమి వీరికిని నిచ్చిరి ఈయకుందురుగాక. ఇది కలికాలము అసత్యమున కున్నగౌరవము సత్యమునకు లేదు, పింగాళీగిన్నెలకును జర్మని వెండికిని గలగౌరవము మంచివెండికి లేదు.

శశి—— లేకేమి, యెక్కడనో యొకట లేకున్నంతనే యట్లనఁ గూడదుకదా!

(పుస్తకమును విప్పిచూచినప్పుడు)

ప్రకా—ఏమి! నీలోనీవేనవ్వుచుంటివి?

శశి—ఈపంక్తులు చూడుము (చేతికిచ్చును)

ప్రకా—ఎక్కడ

శశి—24 వ పుట తుట్టతుదను జయతు జయతు మహారాజః

ప్రకా—తప్పేమి

శశి—ఏమియును లేదు అక్కడ నాచోవుదారీ కేక యెందులకు!

ప్రకా—ఇందుకేకదా! ఆశీర్వచన మనుకొందము

శశి—ఆపుటలోనే

"మా కేనుఁగు నెక్కినట్లు మది కెంతయు సంతసమయ్యె భూవరా!,,

ఈయవధానము చేసి యే కాఁబోలును! ఏనుఁగు నెక్కుట!

ప్రకా—"ఏక్కినా" మన లేదు కదా శ్రీవారు స్వయముగా నాదరించినారు గాన నంత సంతసము కలిగిన దని వ్రాసికొన్నారు.

శశి—ఒకరుమాత్రము స్వయముగాఁ జూడరా! ఆమాట యెందులకు!

ప్రకా—అదేమి మాట! "అధాతో బ్రహ్మజిజ్ఞాసా" దగ్గఱ శాస్త్రార్థము నెఱుఁగవా రాజుగా రెవనినో చూడుమనుటయు నతఁడు మనపండితుఁడే గొప్పవాఁడు చాలా అథాత్తులు వేసినాఁ డనుటయుఁ బిదప రాజుగారు తమ్ముఁ జూడ వచ్చినపండితుఁ డపండితుఁ డని తమపండితునే మెచ్చుకొనుటయు సామెత గాఁ జెప్పుకొనుటవిన లేదా" అట్లుగాక స్వయముగాఁ జూచినా రనుటలో విశేషము లేకపో లేదు.

శశి—ఈయేనుఁగున కర్థ మేమో తెలిసినదా! తిరుపతివేంకటేశ్వరులవలెఁ దాముకూడ నేనుఁగు నెక్కవలె నని కుతూహలమున్నట్లు సూచన.

ప్రకా—వారికేమి కొమ్ములు వచ్చినవా! వారికిని వీరికిని కరచరణాదులు సమానమే ఆశ్రయపు బలిమి యుంటే సరి వీరును నెక్కఁగలరు.

శశి—అక్కడికి వా రక్కెక్కినట్టే కాఁబోలును.

ప్రకా—ఏమో! యెవరు చూచినారు ఎక్కించినారు ఎక్కినారు లేక యదియును నసత్య మేమో!

శశి—పోనీ అంతతోఁ గుదిర్చినావు ఈపంక్తులు చూడుము.

ప్రకా—చదువుము

శశి—"శ్రీవారు స్వయంబుగ మాకొ త్తకుతాంబూలంబుల నొసంగి ము మ్మాదరించుటచే నీమూఁడుసభలలో మాపడినపరిశ్రమం బెల్ల నెక్కువరి న మ్మయ్యె,,

ప్రకా—న మ్మయ్యెననఁగా!

శశి—నాశన మయ్యె నని యర్థము అనఁగాఁ బరిశ్రమము సఫల మైన దని తాత్పర్యము తెలిసినదా!

ప్రకా—అబ్బే వృథాగా వ్యర్థమై చెడిన దనునప్పుడు గాని దీనిని దెలిసినవారు వాడికొనరు పాపము! ఉద్దేశము మంచిదే కాని తెలియక యిట్లువ్రాసికొన్నారు సమ్మానించినచో నొక్కపరి న మ్మయినచో నిఁక నేమి చేసినచో సార్థకము గునో! న మ్మనుపదము తమకు వచ్చునుగదా! యని సంతోషముచే వ్రాసికొన్నారే కాని యీసంశయము వారికిఁ గలుగ లేదు.

శశి—ఈవాక్య మెట్లు లున్న దందువా వెనుకఁ గుంభకర్ణుఁడు "నీదయా నీదయా నిద్రయా, అన్నట్టు లున్నది. ఆక్షేపించువారికి "పాపము! మిమ్ము శ్రీవారు గౌరవించుటయుఁ జిక్కె వచ్చినది గౌరవింపకుండినచో బాగుండును గాఁబోలును ఏమిలాభము ఇప్పుడు వారిసొమ్ము నమ్మయ్యె" నని యొకనక్క మాడుట కవకాశము లేదా!

ప్రకా—ఆమాత్రమవకాశము వీరికవనమున లేని దక్కుఁడ ఇఁక నీయష్టావధానప్రశంస ముగించి శతావధానములోని దేదైన నొకపద్యము చూతము.

శశి— 20 వ పుటలోని యీప్రశ్నమును నుత్తరమును జూడుము.

90 ఇచటి కృత్రిమసింహముల గని యెవ్వరు భయపడుదురు.

క. సింగపుఁబొమ్మలఁగని మదిబెంగన్ గొను వారలిచటఁ బృథ్వీపతులన్
రంగుగఁ దద్గృహములఁగానంగను లేకున్న వా రనన్ వచ్చునృపా॥

ప్రకా—పద్య మెట్లోయుండ నిమ్ము ఆశువుకదా ఇందొకసారస్య మున్నది. ఈకోరిన మహానుభావుఁ డెవరో గాని వీరు కృత్రిమావధానులని పూర్తిగాఁ దనప్రశ్న లోనే తేల్చినాఁడు. అది వీరు మాత్రము గ్రహించినట్లు కనుపట్టదు. గ్రహించినచో దానికిఁ దగినయుత్తర మేదో విధమునఁ బద్యములో నిముడ్పక మానరుకదా!

శశి— అట్టిముద్భుటకుఁ దగినశక్తి యొకఁడినుండి వచ్చును కానిమ్ము. ఈపద్యమును దిలకింపుము. 10-వ పుటలో.

"17 చెఱకు.,,

"క. సరసులగు వారికవనము చెఱకుగతిన్ దీపి గలిగి చెన్నలరారున్
మొఱకులకవనముకఱుపుల తెఱఁగుననిస్సారమగుమదిన్ దలపోయన్॥

ప్రకా—ఇదివఱకుఁ జూచినపద్యములలో నిదియే యనుకూలముగా నున్నది. కాని యిది చెఱకువర్ణనమా! కాదా! యనునంశము విచార్యము.

శశి— ఆయంశము వీరికవనమున నెందును విచార్యము కాదు. 21 వ పుటలో వర్ణనముచూడుము.

(94 శ్రీరాముఁడు)

శా. గారా మొప్పఁగఁ జన్నపద్దెములనే గావింతు రిచ్ఛాగతిన్।

గోరఁ వృత్తము లిప్డుచెప్పఁ గలరో కో'యంచుఁ బల్కించినన్
బీరంబొప్పఁగ నీకవీశ్వరుఁడు పృథ్వీపుత్రికానాయకున్
శ్రీరామున్ నచియించుపట్లరచియించెన్ వెంకియున్ వృత్తమున్

ప్రకా—అబ్బో! కవీశ్వరుఁడుగారిబీరము! పెద్దవృత్తములు రచింప రని లోకులు నిరసింతు రని వీ రెఱిఁగియే యున్నారే! ఇది కీడులో మేలే! పాపము శార్దూలమును జెప్పుటకు వీ రెంత కష్టపడిరో కదా! "వారికష్టం కిష్టారాయుడికే యెఱుక" వారికి సమయమున కేల తోఁచలేదో గాని యీవృత్తమునకుఁ గాదుగదా కొన్నినూఱులుపద్యములకుఁగూడ శ్రీరామునివర్ణన ఘటింప వచ్చునే "శ్రీరామున్ వచియించుపట్ల రచియించెనఁట! ఎక్కడ రచియించెనో!

శశి—ఇక్కడనే యని తెలిసికొనుము ఇది శ్రీరామునివర్ణనము కాఁగా నది చెలువర్ణన కాదా అంత కాదన్నచోఁ బద్యమువదలికొని పైనివ్రాసినయక్షరములు చదువుకొన్నప్పుడేని గాకుండునా! ఈపద్యమునుగూడఁ దిలకింపుము.

13 వ పుటలో

39 యౌవనవము.

క. భావముపలు తెలుఁగులుగాబొవున్ జవ్వనమునందుఁబొందికే దానిన్
రావించి కవిత చెప్పిన దేవుం డని వలయువానిదీవ్యత్సుగుణా॥

ప్రకా—(కన్నీరునించి) ఓహరిదేవర సుబ్బరాయశాస్త్రులవారూ! తాము పరమపదించినను తమకవితాధార నింకను బ్రపంచమున నుంచియే చనినారా! ఔరా! యౌవనవర్ణన! ప్రతిమనుజుఁడును గవనము చెప్పవలెను గాఁబోలును. తాము చెప్పుచున్నారు చాలదా!

శశి— నీ వట్లాశ్చర్యపడినచో వీలు లేదు. ఊరక వినుచుండుము. వరుసగాఁ గొన్ని పద్యములను జూపెదను. 13 వ పుటలో.

38 కాశీవిశ్వేశ్వరగర్భాలయము.

శం. పోలఁగవిశ్వేశ్వరు గర్భాలయమునుమున్ను చూచివచ్చినవారల్

లీలన్ వర్ణింపంగాఁ । జాలుదు రద్దానిఁ జెప్ప శక్యం బగునే॥

### 27 జీవేశ్వరసంబంధము.

౪౦. జీవేశ్వరసంబంధము । భావింపఁగఁ దర్కశాస్త్రపండితులకు వి
ద్యావైశద్యముకతమున। దీవిన్ దెలియంగ వచ్చెడిన్ భూపాలా!

11 వ పుట.

### 28 సర్వమతసంగ్రహము.

తే. సర్వమతసార మేమన! సంగ్రహంబు
గా నచించెద వినుఁడు సద్భావమునను
జీవుఁ డీశ్వరుఁ డొకఁ డని చిత్తమునఁ ద
లంచుచుండుట భూపకులాగ్రగణ్య ! 11వ పుట.

### కోహినూరువజ్రము.

శా. పారావారసమీపభూమి నొక నింబం బంతరత్నంబు చే
కూరెన్ దాని స్వదేశరాజు వెలమిన్ గొన్నాళ్లు దాల్పంగ భూ
దారుం డెవ్వఁ డిప్డు తచ్ఛకలమున్ దాఁ గంఠహారంబుగన్
పౌరారంగ ధరించుఁగోహినురువజ్రం బంద్రు దానిన్ బుధుల్

78 వ పుట.

ప్రకా—ఆఁగు ఆఁగు కోహినూరువజ్ర మెంత యున్నది. నింబం బంతా ! అనఁగా! వేపకాయంతా! దీని నెవ్వరుగారు ధరించిన దెక్కడ! హారమునందా! కిరీటము నందుఁ గాదా! కానిమ్ము. ఇఁకఁ దెక్కిన విశ్వేశ్వరాలయము కాశికి వెళ్ళిన చోఁ దలియును. తర్కము చదువుకొన్న జీవేశ్వరసంబంధము తెలియును. అన్నిమతములసారమును జీవేశ్వరు లొకటే యనుటయును జక్కఁగనే యు న్నవనుకొందము గాని యీవెఱ్ఱి వేపకాయయును హారధారణమును నెట్లుకు దురును.

కం తటుకున నెత్తింపన్వలెఁ । బటముల నమరీశ్రమాంబుఁ బాపెడి ధ్వజముల్
పటహానక ఝరీరవ । ఘటితంబుగఁ జేయవలె జగత్త్రితయంబున్ —అని—

అందొక యభిషేక సంభార సంభరణముతప్పఁ దక్కినవన్నియు నే నేనిర్వర్తించితి ఆయభిషేకసన్నాహము బ్రాహ్మణులే యాచరింపవలసినది కాఁబట్టి యింక వీరికులాచార్యులగు శాండిల్యులవారిని వెదుకవలె (అని ముందునకు నడుచును.)

శాండి—నాయనా విశ్వకర్మా! ఎచటికిఁ బ్రయాణము.

విశ్వ—అయ్యా! మిమ్ములనే వెదకుటను.

శాండి—నాతోనేమి ప్రయోజనము.

విశ్వ—ఉ॥ కాలునివీటికింబనిచి కంసుని నాతనితమ్ము లేడ్వురిన్
హేలనమస్తభూమిని జయించిభుజంబులబల్మిఁ దన్మహీ
పాలన సేయఁ జక్రికిఁబట్టముగట్టఁ దలంచియున్నవాఁ
డా లలనామనోజుఁడగు నయ్యతఁ డుర్వి నకంటకంబుగాన్॥ 4

శాండి—విశ్వకర్మా! ఈభగవంతుఁడు తనయధీనమగుజగమండలి ప్రాజ్యమగురాజ్యమును నిజభుజబలార్జితంబైనను మరల నన్యులకేలయిచ్చుచున్నాఁడు? తానే యభిషిక్తుఁడు కాఁగూడదో?

విశ్వ—ఓహో! పప్పులో నడుగువేసితివి.

శా. స్వారాజ్యాదిసుఖంబు యత్సహజసత్సౌఖ్యాబ్ధికిం బిందువో
యేరమ్యాకృతిరోమకూపములయందే యుండె బ్రహ్మాండము
ల్శ్రీరమ్యుండతఁడు జగద్గురుండునను తల్లీలార్భకాకారు హ్ర
న్నీరేజంబునఁగాంచఁజాలవెపుడున్ నీచేన్ఛ గర్ధేషణల్॥ 5

శాండి—ఓయీ! యొకమాట

చం. అతులితవిక్రమాన్వితులు యాదవు లేబదియాఱుకోటులీ
క్షితితలమెల్లనాక్రమణచేసి వసించుచునున్నవార లా
మతియుతులందరొక్కనికి మంచిగఁ బట్టముగట్టఁడేల శ్రీ
పతి తగదొక్కనాఁటికిని భక్తునిశక్తు నుపేక్ష సేయఁగన్॥ 6

విశ్వా—ఉన్న దిందుకొక రహస్యమైన కారణము

శాండి—అదియెట్టిదో సావకాశముగాఁ జెప్పుము.

విశ్వా—యదువునకు యయాతియొసంగిన శాపము "తద్వంశ్యులు రాజ్యార్హులుకారని" యొక్కగొప్పకథపురాణములయందు వినఁబడుచున్నయది. ఇదియుంగాక—

ఆ. దుష్టుఁడైనఁగాని తోఁబుట్టువైయుంట । జనని కంసుమృతికిఁ గినియునను చు
నచట నామెతండ్రి నభిషిక్తుఁజేసెడు । నాపెముదము నాత్మ నభిలషించి॥

అగుఁగాక. ఇదియప్రస్తుతప్రశంస. ప్రకృతమనుసరింపుదము.

శాండి—ఐతే భగవంతుఁ డిప్పు డెందున్నవాఁడు

విశ్వా—నన్నీపనికి నియోగించి యన్నతోఁగూడుకొని స్వయముగానే దేవకీవసుదేవులసంకెలలూడఁదీయుటకుఁ గారాగారముఁబ్రవేశించె

శాండి—అట్లైప్పుడో నేను నచటికేపోయి యాయనతోఁగలసెదను (ఇట్లుభయులు నిష్క్రమింతురు) ఇదిప్రవేశకము.

(అంతట దేవకీవసుదేవులును రామకృష్ణులును బ్రవేశింతురు)

వసు—(పుత్రులంగాఁగలించుకొని శిరస్సుమూర్కొనియుఁ గన్నీళ్ళతో)హావత్సలారా!

ఉ. ఇప్పుడుకాదెవొచ్చితిమి యీవలు మేమును జీవలోకముక్
దప్పరమైనశోకమునుదీఱెను వచ్చెను నష్టనేత్రముల్
చెప్పెడిదేమి త్వద్వదనశీతమయూఖసుధావగాహమా
నప్పుడె సారయుక్తముగనయ్యెను సంసృతి సౌఖ్యమబ్బుచుక్॥ 8

దేవకి—సీ. జోకొట్టఁగానైతిసుఖముగానిదురింప నిడుకొనిమిమునాదుతొడలపైని
నడుపింపఁగానైతినాకరాంగుళియూతఁ దప్పటడుగులు వెట్టుతఱిని మిమ్ముఁ
బాలీయఁగానైతిఁజాలినయందాక శిరముమూర్కొని వీపునెలుముకొనుచు
లాలింపఁగానైతి లలి నొక్కయెడనేనిబహువృదుగీతముల్ పాడుకొనుచుఁ
గాంచఁగానైతిఁజెల్మిమైఁగనులువిప్పి । నోచఁగానైతిమీముద్దునుడులువినఁగఁ
గడుపునంగనియునుమిమ్ముఁగడకునేను । నంధ్యలాగునగడపితిఁ వాసరములు॥ 9

రాము—శా॥ మామూలంబుగఁ బ్రత్యహంబు మిము నా మర్త్యాదుఁడత్యుగ్రుఁడై
వేమారుంగడుబాధపెట్టెఁగద యేవేళన్ సుతార్థా క్రియన్
మేమొక్కింతయుఁజేయమైతి మకటా! మీరద్ది పాటింప కీ
మామీదం గృపయుంచి మా యవినయాల్ మన్నించి ప్రోవన్వలెన్॥ 10

(ఇట్లుసాష్టాంగముగా రామకృష్ణులిరువురును దలిదండ్రులపాదముల పైఁబడుదురు. వారులేవఁదీసికౌఁగిలించుకొందురు)

కృ—(భయముతో దోసలియొగ్గి)

తే॥ మహితకులదూషణుండు దుర్మార్గుఁడైన । నీదుతోఁబుట్టునా చేతనిహతుఁడయ్యె
నేతదపరాధమునునీదుహృదయమందుఁ । బరిగణింపకక్షమియింపవలెను దల్లి! 11

దేవకి—నాయనా! అట్లనుడువకు.

తే॥ అనుభవించుచునున్నార లఖిలజనులు । తాముజేయుశుభాశుభాల్ తామెజగతి
నెవరికర్మమువారిదె యింతెకాని । యితరు లపరాధులనియెడి దేటిమాట॥ 12

(ఆనందముతో)

కృ—శాపభీతినొలఁగి యిప్పుడుబ్రతికితి (మరలసాంజలిబంధముగ) జనకులారా! నా యందుమీకనుగ్రహము కల్గినమాటయేఁనిజమైన నొకింతమనవిచేసెదవినుఁడు. దైవవశముననో ప్రమాదవశముననో యైనమదపరాధమునఁజేసి జగమంతయు నరాజకంబైయున్నయది. ఇట్టియరాజకంబగురాష్ట్రమిష్టప్రాప్తికిని ననిష్టపరిహారమునకును సమర్థమైనదికాదు.

తే॥ నాయకుఁడులేనిరాజ్యంబు నాశమొందు। నాయకులుపెక్కురైనను నాశమొందు
శిశువెనాయకుడైనచోఁ జెడునుమొదలె । స్త్రీయెనాయకురాండ్రైనఁ జేటునిజము

అనిపెద్దలుదాహరింతురు. అందుకు మద్వంశజులపై మదభీష్టములేదు. పలుమందిసన్నిహితులైయున్నను మీ రుభయులునగుమతించినచో మామాతామహుండగునుగ్రసేనుఁ డేతత్స్థానంబుననభిషేకము సేయఁదగినవాఁడని నాకుమనోరథం బొడవుచున్నయది.

దేవకి—ఇది మాకును నభీష్టమే.

కృ—అట్లైనచో పదుండు మాతామహాభిషేకమహోత్సవముఁ బ్రారంభింతము.

రాము—కాఁబట్టిమన మెల్లరముం గృతస్నానప్రసాధనాదిమంగళక్రియాకలాపులమై శ్రమాపనోదనపురస్సరంబుగ నభిషేకమంటప సమీపముందధివసించి కానిపను లెవ్వియో యైనపను లెవ్వియో కనుంగొనుచు సమాజకౌతుకం బనుభవింతము.

కృ— అన్నయ్యా! ఆజ్ఞయగుగాక. మఱియును, పితరులు కృతాలంకారులై రాజద్వారముంజేరులోపల మనము నిర్వర్తితాభిషేకుండగు మహారాజువద్దకేగి పితరులరాకని వేదింతము.

రాము—భవదిష్టప్రకారమాచరింతము. (ఇట్లిరువురును నిష్క్రమింతురు.)

[అంతటనుగ్రసేనుఁడును రామకృష్ణులును బ్రవేశింతురు]

రాము—మహారాజా! దేవకీవసుదేవులిరువురును మీదర్శనమునకై ద్వారమునఁగాచియున్నవారు.

ఉగ్ర—(వేగిరపాటుతో) ఓహో! ఏల యీయాలస్యహేతువులగు విన్నవింపులు? నేనేపోయి వారిని బ్రవేశపెట్టెద. (అనిత్వరగా లేవబోవును.)

కృ— మహారాజా! పట్టాభిషిక్తులరై సర్వేశ్వరపదమునం బ్రతిష్ఠితులరగు మీకిప్పుడు స్వవిధేయులగుజనులయెడఁ బ్రాకృతమనుజులుంబోలె బాహ్యోపచారం బొనరించుట యయుక్తము. కావున దేవరయాజ్ఞాప్రకారము మేమే ప్రవేశపెట్టెదము.

ఉగ్ర—ఇఁక నేనేమి జవాబియఁగలను. మీరు మిక్కిలిపూజార్హులు కావునఁ బ్రియసమాగమునకై విలంబముచేయఁగిట్టదు.

రాము—(నిష్క్రమించి పితరులతో మరలఁబ్రవేశించును.)

వసు—(ముందరఁజూపించి) ఓహోహో! ఈయుగ్రసేనుఁడు స్వేష్టప్రాప్తియందలి యత్యాతురత యాకంఠపూర్తిగాఁగ నతిశీఘ్రముగ నాయుత్తపఱుపఁబడిన

ప్రోద్యత్కర్దమదుర్గమాజినర్ణం బోలేక తద్భూచరుల్
వ్యాద్యం బామర మంద్రము మింటఁ బటుఘోటింధాన రింఖాకృతా
చ్ఛేగోత్రోర్వీరజమెచ్చఁగా ననిమిషుల్ చెల్వొంద్రు మర్త్యత్వముల్. 103

సీ॥ శస్త్రాహతమస్తకప్రస్రుతదీర్ఘోష్ణక్షతపటలముల్ బంతిచాపలుగ వైచి
సంభిన్నరిపుకుంభికుంభముక్తామణి పారంపరలఁ బీటపట్లు పెట్టి
నిర్భిన్నలితద్విషన్నిర్మలాయతచర్మఫలకముల్ పట్టిరంబులుగ నిలిపి
యాలూనవైరిభూపాలకపాలముల్ చేగిన్నియలుగ నచ్చెంతనునిచి
మించిమాంసపువ్వుముపు వడ్డించినపుడు । డాకినీశాకినీభూతలోకములకుఁ
జటులశాతాస్త్రపాణియై జలజపాణి । పెండ్లినాశౌరి రణలక్ష్మిఁ బెండ్లియాడె. 104

వ॥ ఇవ్విధంబున నతిఘోరంబగు యుద్ధరంగంబునఁ గుంభినీరమణాకారుఁడైన కుంభినీరమణుల హరి హరింబోలి నిరసించి ద్వారకాభిముఖుండై చనిచని. 105

సీ॥ భామభాను ప్రతిబంధిశాఖాశిఖోత్కరముచే నభ్రగాంస్తరణము
కరికరాగ్రోద్ధూతకర్బూరతరుగజస్థితిచే సురీపతితంకరణము
ఖగవేగవిహగసంక్రాంతాబ్దగళితముక్తాళిచే నవవరాశ్యాకరణము
శరభార్తసింహగర్జాప్రతిధ్వనులచే గ్రావమహానుభగంకరణము
నై సువిశ్రాంతసంకుమదాభిలిప్త । తతభిదిక్షువవేణు ముక్తాఫలోద్ధ
రంగవల్లికమార్గాభిరామమైన । ఘనతరారణ్య మొక్కటిఁ గనియె శౌరి. 106

ఉ॥ తాలికఁ జేసినన్ స్వముఖతామరసంబుల కాశశాంకునిన్
బాలికఁ జేసి హెచ్చు పరిపుచ్ఛెదరోయని కాని ఘూని రే
యేలిక జింకనైన నొకయేటున నే పడనేయనేర్తు రు
ద్వేలచమత్క్రియాకలన హెచ్చఁ జరించుపులిందసుందరుల్. 107

కం॥ వనవనమున నెమ్మదములు । రివరివమును మధ్యములు ద్విరేఫశ్రేణుల్
జవజవమును వేణీకి వది । రవరవమను మరుఁడు వారిరంగులు గనినన్. 108

సీ॥ చిఱుతనగో డెలాడ విఱుగుర పెళ్ళున గజదంతముకకేలఁ గరముఁబట్టి
గహిఁ గూఁతలిడ బొంగరవుజాలెక్కి త్రొక్కి పెఱుకుమురు మృగేంద్రభీమనటులు
పంతంబుతోఁ జాకిబానతిర్గకునంచు బెబ్బులితిత్తోత్తరబ్బరముగ

ధృతి నీలకొట్టాకు నెరకుఁ దెస్తురు గుంటగండభేరుండముఁ జెండి తొక్క-
యావులాటకు ఘనవరాహములఁబట్టి । కొమ్ములటుఁ ద్రుంచి పగులంగ గ్రుద్దివాని
గొప్పము త్తెములెల్లఁ గైకొందురంచుఁ । జెంచుమున్నులసాహసం బెంచఁదరమె 110

గీ॥ అట్టివిపినంబు కనుచిత్ర మనుచు వెడలి । కమలదళలోచనుండంతఁ గలిపయప్ర
యాణముల ద్వారవతిఁజేర నరుగుదెంచె । సర్వసన్నాహసముదితోత్సాహుఁడగుచు

చ॥ జలనిధి డాఁగియున్న గిరిసంఘముఁజూడఁగవచ్చు వెండిగు
బ్బలిపయి విద్రుమంపులతవారుతమాలమురీతి వజ్రకం
దళములఁదేరుతేరిపయి తామరసేక్షణుఁ గూడి శౌరి దా
నలరఁగ నప్పురింగలలతొఁగులు సంభ్రమసంభ్రమాత్మలై 112

ఉ॥ ధావన మొప్ప నోర్తు మురిదండముఁ జూడఁ జనంగఁ గొప్పపై
గ్రేవల రాలి చెంగలువరేకులు తేఁటులఁగూడి యొప్పె నా
త్రోవ ననేకయావతరగుండయి తన్నెడ సేయుశౌరిపై
నేవలు పాటి యుగ్గినమహీనతిపాటలితాక్షులో యనన్ 113

ఉ॥ ఇంపలరఁ బెంట్లయాన నవుదొంతియు డెంకము నిండియుండు గో
విందుని కన్నరీతి ముడివీడినను గ్గొక కేలుఁదమ్మి చే
ముందరికాని యొక్కటఁ బ్రముగ్ధచలత్కుచపాళి నాఁగుచున్
సుందరి యొక్క నోర్తుహరిఁజూడఁగఁ గాంచనసౌధవీధికన్ 114

ఉ॥ కస్తురముప్పతిల్లు సరిగందమలంది యలంది గందపున్
జిప్పయుఁదాను నేగనొకచేడియవీడక వేడుకల్ మదిన్
జిప్పలముంచి యుత్తు యదుసింహముఁ జెందుని నంద్రికారసం
బొప్పఁగఁ జారుచారునయనోరుచకోరుల కన్నతీరునన్ 115

ఉ॥ రెంగటనున్నయుండిగపుఁ జేడియ చుట్టియొనంగునాను పా
ణిం గదియించి నాసపయి నిల్పె నిజాంగుళియొర్తు శార్ఙ్గిన
ర్థిం గను నాగవల్లి శుభదేవత సాక్షి యథార్థ మీమహా
మంగళమూర్తి యొక్కఁడను నను ప్తుజగంబుల కాధ్యుఁడన్నరిన్ 116

చ॥ ఎలమిగఁ జిన్ననాఁ డితను నెత్తుక ముద్దొనరించువేఁ తమూఁ
కలజిగిమోవి చన్నులును గంటుడుగాయలు లక్కఁగొంచపం
డులుగ నొనర్చి యాడినఘనుం డిపు డెండలి నైనఁ బెండ్లియై
పాలుపగు టేమి? యంచు నొకప్రౌఢ నగించె సఖీజనంబులన్ 117

గీ॥ శ్రుతిలసత్స్వరనోత్తి శుద్ధభూమి । తారకాంశుకయుగము నెంతయు వినీల
వేణ్యుపశ్లిష్టకుస్తావవేశకేళి । నందదే జననేత్రాళి? యనిమిషతలు 118

వ॥ ఇట్లు పురంబు ప్రవేశించి గతపురంధ్రీలోకాలోకరోలంబకదంబకాగణ్యపణ్యమ
గంధసందోహప్రధానకళాధురంధరముఖారవిందుండై మందగమనంబున రాజమార్గం
బునం జని చని. 119

ఉ॥ గౌరవ మొప్ప నాత్మజనకప్రథలోపడఁ జెలంగునావసాం
భోరుహమండలంబునకుఁ బూర్ణశశాంకముఖీప్రయుక్తమా
నారతిపేరఁ గల్గినశుభాశ్రిపసక్తిని మాచరింపఁగా
సారసపత్రలోచనుఁడు చయ్యన నాత్మగృహంబు ప్రవిష్టుఁడై 120

క॥ పెండిలికొమార్తెతో మురఖండనుఁ డత్యంతవినయకలితాత్మకుఁడై
దండ మిడె స్వస్థబాంధవమండలి కిలువేల్పులకును మహితప్రీతిన్ 121

వ॥ అంత. 122

సీ॥ ఓష్ఠపుటనికుంచనోత్కుంచనములచేఁ గుండలంబులాలింతగునిసియాడ
నూర్పులబలిమిచే నుబ్బుసుక్కులనొప్పు బొజ్జలజన్నిదంబులు చలింప
నందంబుగా నుదాత్తానుదాత్తస్వరస్ఫురణంబు చేబొమల్ పుటము లెగయ
శ్రమవారి చేగోపిచందనంబునఁ బెట్టుఫాలోర్ధ్వపుండ్రముల్ పదనుగొనఁగ
ఘననిరర్గళగళగళత్కలరవంబు । తూర్యకోటికిమిగుల వావాడు గాఁగ
గర్గమునిముఖ్యభూసురవర్గమపుడు । వరుసనొనరించెఁ బుణ్యాహవాచనంబు 124

సీ॥ రాజులయరిసంహరణసమున్నతిఁ జూచి సమదసారంగముల్ చాల నొసఁగి
విప్రవరులయనంతప్రచారగుణంబు మదినెంచి బహుళతరచ్ఛదము లొసఁగి
కవిసంఘములపదగ్రథనచాతురి మెచ్చి సారసహితములౌ శరము లొసఁగి



# వీరభాగవతము.

——:(o):——

## తృతీయాశ్వాసము.

——:(o):——

కం॥ శ్రీకర! సకలగుణాకర! నాకాధిపవిభవ! వితరణాగమభూజా!
రాకా శశిసమవదనా! ప్రాకటశుభసదన! యుల్లయాహ్వయ మదనా! 1

తే॥ అవధరింపుము సన్మను లట్టులడుగ । సంతసంబున ధర్మప్రసంగమౌని
పలికెఁ గ్రీస్తాబ్దసంకీర్ణభాషణములఁ । జెన్నకేశవు నాత్మఁ బూజించి మించి 2

కం॥ హరి పరశురామరూపాం । తరమున భూపతులతలలు దఱుఁగుచుఁ దత్త
చ్ఛిరముల సోపానంబులు । విరచించెనిలింపపురికి వీరత్వమునన్ 3

ఆ॥ వెదకి వెదకి రాజవీరులనిర్భంగిఁ । దఱిమి తఱిమి వారితలలుదునుమ
దశరథుండు భయముదాల్చి యొకవిప్ర । మందిరమునదాఁగె మరణభీతి 4

కం॥ తనమందిరమున దశరథ । జననాథునిదాచి విప్రసత్తముఁడు నిజాం
గనయుం దాను బ్రకోష్ఠం । బున నిల్చిన జామదగ్ని భూవిభుఁడనుచున్ 5

ఆ॥ నిజకుఠారధార ద్విజపుంగవునిఁ ద్రుంచి । సుదతినడచె నిండుచూలనాక
గర్భభేదనంబుఁ గావించె వెరఁదక్క । ప్రతిన కింక నేటిపాతకంబు 6

కం॥ లీలావతిగర్భంబున । బాలిక నెసలించి గగనపథమున నెగయన్
గేలంజిమ్మి వడిం గర । వాల ద్రుమ్మటుబట్టె నది దివంబున నిలిచెన్ 7

వ॥ ఇట్లు గగనభాగంబుననిలిచి చతుర్భుజయై ఖడ్గాద్యాయుధంబులుధరియించి జామ
దగ్నింజూచియిట్లనియె 8

ఆ॥ బ్రాహ్మణుఁడవెనీవు? బ్రహ్మహత్యయు బాల । హత్య యువతిహత్య లాదిగాఁగఁ

జేసినాఁడ విట్టిచెడు గొందులేఁడు నీ। నామమొకటి రామ! కామదంబు 9

కం॥ నీతోఁ గదనము సేయఁగ। నేతెంచితి రామ! నను జయింపుము నిమ్మై
భ్రాతలజననివధించుకి, రాతకు నిను విడిచిపుచ్చరా డెటులైనన్ 10

చం॥ అనవిని జామదగ్ని కమలాయతలోచనఁ జూచి లేమ! నీ
కనుగుణమైనరూప మలరారధరించి జగంబెఱుంగ ని
న్ననిఁదెగటార్చునంతకుఁ బుం-రిపురంబుననుండుమన్న గ్ర
ద్దనఁగరముల్మొగిడ్చి కలధౌతనగాగ్రముఁ జేరవేడుకన్ 11

కం॥ అదిమంత్రవిధియనంగాఁ। బదఁపడిమాచాపురమున బ్రహ్మనాయుం
డుదయించుతఱిని బెక్కా। పదలానరించె నిదెకాద పటుకోపమునన్ 12

కం॥ ఆ మంత్రవిధియె వెండియు। భూమండలమునజనింపఁబూని యవీరా
కామినిగర్భంబుననొక।భామినిరూపమునఁ బుట్టెఁ బటుతేజమునన్ 13

కం॥ ఆకామిని జనులెఱ్ఱఁగినఁ। జేకొనరనుభయముతోడఁ జీఁకటియని యా
ద్రేకింపకవనభూమి ల। తాకీర్ణగుహుంగమున రయంబుననునిచెన్ 14

తే॥ వెలిచివిశ్వస్త జనులెవ్వరెఱుఁగకుండ। సరభసంబునఁ దనదుమందిరముఁ జేర
నతనబ్బాల నల్లిగృహాంతరమున। బ్రతికెఁ బ్రజకెల్లనీశుఁ డేరక్షకుండు 15

సీ॥ పెనుపొంగఁబల్నాఁటిజనపదంబున జిట్టగామాల పాడునాఁగలుగునూర
హాలికుండు వెలయు నిచ్చలు దున్నకొను పొట్టినాగిరెడ్డనఁ బాకనాఁటికాఁపు
అలికదోలుకచేనికరుగుచుండఁగ దుక్కిసరస కింశుకమహీజంబుక్రింద
మంజాగుంజాలతాకుంజగర్భంబున బాలికారోదనం బాలకించి
యబ్బాలీవర్ధనంబులనాపి తోత్ర। మంసభాగంబునన్ను ద్రేవేల నలికియలిక
చేతములుకోలసవరించి చేరఁబోయి। బాలఁగన్గొనెఁ గన్నులపండువుగను 16

కం॥ బాలన్ నలువ సుధాజం। బాలంబుననినుని సానబట్టినపాడిసా
బాలంగలిపిరచించెనో?। ఫాలాక్షునికరుణ నిట్లుప్రభవించినదో? 17
కం॥ ఈపాపఁగొంచుఁబోయినఁ। గాపాడున్నాపాలంతి గాదిలినుతుఁగా

నాపాలిపెన్నిధానము । గాఁ బాలింపుద నితాంతకారుణ్యమునన్ 18

వ॥ అనివిచారించి. 19

కం॥ తనకరములనాబాలిక । ననువొందఁగఁబట్టియెత్తి యక్కునఁగదియిం
చిన నవని గంపమొందెన్ । వినువీధిం జుక్కలచట పెడపెడఁబడియెన్. 20

తే॥ అమ్మహోత్పాతమునకు భయమ్ముగొనక । సమ్మదంబందియక్కఁపు సత్వరమున
నింటికేతెంచి తనయింతికిచ్చెబాల । నలమికొనివేడ్కఁజన్నిచ్చె నవ్వెలంది. 21

చం॥ అదివృతవంధ్యగావున రయంబునఁజన్నులఁబాలుచేపె న
మ్మదవతి వల్లభుండును గ్రమంబునఁదత్కృతిమెల్లఁజెప్పఁగా
ముదమునఁనాలకించి తనముద్దుకుమారికగాఁదలంచి పెం
పొదవఁగనాదరించె సమయోచితకృత్యములెల్లఁదీర్చుచున్. 22

తే॥ హాలికుఁడును జేనికడకేగి హలముబన్ని । యులఁబెకలదున్న లాంగలంబెలువొనర్చి
పగ్గములఁబట్టి యెద్దులమ్రొగ్గఁదోలి । చాలుచక్కఁగనడువ చాచాయనంగ. 23

కం॥ ఖాదంబుకొనను ఖంగన । భేదిల్లెనిధానమతఁడుబీదయగుట నా
హ్లాదించి వసుమతియునన్ । రాదే? యీధరణి నాదరంబున జనముల్. 24

ఆ॥ ఇతరజనులుచూచిరేని తేనికిఁజెప్పఁ । జాతురనుచుదాని బ్రాతిపైచి
పొలముదున్ని ప్రొద్దుపోయిన నిలుచేరి । యర్థమున్నకడకు నర్ధరాత్రి. 25

చం॥ చనిశకటంబులన్ ధనము సర్వము శేషముగాఁగఁదెచ్చి యిం
పెనయఁగఁ గప్పిపుచ్చి తనయింట మఱెవ్వరుఁ జూడకుండఁగా
నమఘనదాచి తొల్లిటిక్రియంజరియించుచు బాలికామణిన్
బెంచుచునుండెఁ దాఁగనినబిడ్డకు మిక్కిలిగాఁగనిచ్చలున్. 26

వ॥ ఇట్లుదినదినంబు వృద్ధింబొందుచున్నంతనక్కఁపు తేను తనవెలందికిట్లనియె. 27

ఆ॥ బాలఁదెచ్చినపుడె భాగ్యంబు ప్రాప్తించె । నబలపెఱుఁగఁ బంటలధికమయ్యెఁ
బంకజాక్షి మనుజబాలయే? మనపాలఁ బాలవెల్లిఁబుట్టు బాలగాక. 28

కం॥ సుతయైననిదియెమనకిఁక । సుతుఁడై నని దేశలంప శుభలగ్నమునన్

గుతుకమునఁజదువఁబెట్టఁగ । నతివరో! మనయింటఁ జదువులన్నియునిల్చెన్. 29

మ॥ అనియోచించి పడంతియున్ విభుఁడు నన్యోన్యప్రమోదంబునన్
మునుజాలన్ జదివించి వెండియును సాముల్ నేర్పి ఖడ్గాదిసా
ధనముల్ కుంతశరాసనాశుగసమర్థత్వంబులంజూపినన్
దనుదాసర్వచమత్కృతుల్ గఱచెఁ జిత్రం బొక్క వర్షంబునన్. 30

ఉ॥ బాలసమస్తవిద్యలఁ బ్రభావతి దీనిఁ బరిగ్రహింపఁగాఁ
జాలినవానికిచ్చి సరసంబునఁ బెండిలి చేతునంచు న
న్నాలవజాతి కోఁడు స్వజనంబున నూతనమీనకేతునిన్
బోలినవానికిచ్చెఁ బరిపూర్ణవయస్కున కక్కుమారికన్. 31

ఆ॥ శుభముహూర్తమునను చుట్టాలుమడిసిరి । బోనములదులొక్క పోరిగొడసి
రత్తిమామలిద్దఱారాత్రిప్రమగ్గిరి । యాజ్ఞికుండు ధర్మనాశ్రయించె. 32

కం॥ సాకబలినాఁడె తనపతి । లోకాంతరమునకు నరిగె లోకమడలఁ ద
దాకేందువదనలగ్నం । బేకోలఁది వసింపవచ్చు నీశునకైనన్. 33

ఆ॥ తల్లిదండ్రిమున్నె చెల్లి రాబాలిక । ఞాతిగుండెకాని భీతిలేక
నతిముదంబుతోడఁ బ్రతికె రక్కసిక్రియ । భాగ్యమున్ననింక భయముగలదె. 34

కం॥ ఆయింటిధనమునకునది । నాయకురాలైనకతన నాగాత్మజ వా
లాయంబుగాఁ గజనములు । నాయకురాలనెడి పేరునం బిల్చిరొగిన్. 35

మ॥ హాలికోద్యోగములున్ దురంతవణిజవ్యాపారముల్ భూ
మిభర్తలతోఁ జెల్మియు వృద్ధిలెక్కలు సమర్థప్రక్రియాయోగ సం
కలనంబొప్పఁగఁ దొంటికంటెఁ బటుభాగ్యప్రౌఢిఁ జేమించి ని
చ్చలు భూపాలసభాంతరాళమున విశ్వాసంబు సంధింపుచున్. 36

మ॥ మధురాలాపములన్ మహీపతిని సంభావించి దివ్యోపధా
విధి గారుత్మతపద్మరాగమణిసంవిద్భూషణంబుల్ మనో
రథవస్తూత్కరమిచ్చునిచ్చి ముదమారన్ వేడ్క సేవింపఁగాఁ
బృథివీనాథుఁడు మెచ్చుచుండు నతిగంభీర స్వభావంబునన్. 37

వ॥ ఇట్లు రాజమందిరంబుఁ జొచ్చి శుద్ధాంతకాంతాజనంబులను సభాంతరాళంబునం గల రాజబంధుపరివారసామంతపురోహితవిద్వద్గాయకాదులను సామదానంబులం దన వశంబు చేసికొని యొక్కనాఁ డేకాంతంబున భూకాంతున కిట్లనియె 38

కం॥ "నావిష్ణుః పృథివీపతి" । నా వినవె ధరాతలేశ! నరులకు నృపుఁడే
దేవుండు గాన మహీదివి । జానళి మొదలుఁగను నమ్రములౌదురు నీకున్ 39

కం॥ ఆయతపదమున బ్రహ్మ । నాయుఁడు సభలోన నీకు నతిఁ జేయఁడు ము
న్నాయసనిగమశిఖావి । ద్యాయుక్తుఁడ ననుచు వీరధైర్యస్ఫురణన్ 40

తే॥ బాహుజుఁడవీవు భావింపఁ బదజుఁడతఁడు । ధరణిపతివీవు నీకుఁ బ్రధానియతఁడు
కర్మఠుఁడవీవు నతఁడు నిష్కర్మకుఁడు । నతనికిని నీకు గజమశకాంతరంబు. 41

కం॥ నీకు ద్విజత్వము సహజము । లోకంబున నూరుజాతులును బదజాతుల్
భూకాంతునకును మ్రొక్కెడ । రే? కల్మషములు దొలంగ నిది తప్పగునే? 42

తే॥ బ్రాహ్మణుండైన నృపతికిఁ బ్రణుతి సేయ । వలయు నెట్లన్నఁ దొల్లి భూవల్లభునకుఁ
దనయ నిచ్చి మొగిడ్చెఁ గేల్దమ్మి శుక్రుఁ । డితర మేయిది వేదసమ్మతము గాదె? 43

చం॥ ద్విజునకు నంఘ్రిసంభవుఁడు తెల్లము గా నతి సేయకున్న భూ
భుజుఁడు సహింపఁ గాఁదగునె భూరిపరాక్రమ వర్ణధర్మముల్
ప్రజ కెఱుఁగంగఁ దెల్పనగుఁ బాడి దొఱంగిన శిక్ష సేయ మి
మ్మజుఁడు సృజించె మున్ను తనయంశమునన్ ధరణీతలంబునన్ 44

చం॥ అనిన మహీవిభుం డనియె నంగన! సత్కృప మర్త్యలోక పా
వన మొనరింప నచ్యుతుఁ డవారితతేజుఁడు మానవాకృతిన్
జననము నొందెఁ గాని జనసామ్యుఁడె యాతఁడు సేయునట్టి వం
దన మొకపూరుషుండు దగునా గ్రహియింప నెఱింగ నేనియున్? 45

కం॥ అనవిని నాయకురాలి । ట్లను బ్రహ్మ నాయఁ డచ్యుతాంశంబైనన్
మన మెవ్వరి యంశంబని । మనమునఁ దలపోసితి పృథుమనుజాధీశా! 46

కం॥ దేహములు దాల్చు జీవస । మూహము నాయంశ మనుచు మురహరుఁడు కురు
వ్యూహంబు నడుమఁ జెప్పిన । నా హవ మొనరించెఁ గాదె యర్జునుఁ డెలమిన్. 47

తే॥ ఇట్టు లేకాంతమున ధరణీశుతోడఁ । దెలుపదుర్భోధలొనరించిదినదినంబు
దొడ్డనాయునితోడగుదొరలతోడఁ । బొసఁగుముచ్చటలను బ్రొద్దుపుచ్చుచుండు

కం॥ ఎదుటైనవారి నెల్లన్ । బెదరింపుచు లేనిపోని పెడకయ్యముతోఁ
గదలక కాల్ద్రివ్వుచు న । మ్మదపతిశూరులకు మాఱుమసలుచునుండున్ 49

వ॥ ఇట్లసన్మార్గంబునంబ్రవర్తిల్లు నమ్మత్తకాశిని దుర్బోధనంబులకోడంబడిపుడమిఱేఁ
డాసన్నశరీరపతనుండగుటఁ బ్రధానాగ్రేసరుండగుదొడ్డనాయునింజూచియిట్లనియె

కం॥ కొలిచితివిమమ్ము ననిలోఁ । గెలిచితివభియాతికోట్ల గెరలక మదిలోఁ
దలఁచితివి చెన్నరాయని । వలచితివచ్యుతుని నగరివాకిటనిలువన్ 51

ఆ॥ కయ్యములను మొగము గాయముల్ గెరలింపఁ । బోరిపోరిబలముదారవోసి
తింకనింటనుండు మీసొదల్ నీకేల । కొడుకునంపు మిచటికొలువుఁజేయ. 52

వ॥ అనినదొడ్డనాయుండిట్లనియె.

కం॥ గడచితిబహుకాలంబులు । పొడిచితిఁబరిపంథిజనుల భోగములను బో
విడిచితి సన్మార్గంబున । నడచితి మీకొల్వుఁజేయ నాయునిబనుతున్ 54

సీ॥ అనిమహీపతియాజ్ఞఁగొని మందిరముఁజేరి పొలుపొందనాస్థానమునవసించి
తనతనూజులగు నేవురనుబిల్చికూర్చుండనియమించి కార్యంబునిర్ణయించి
పృథివీశ్వరుని చిత్తవృత్తిఁదెల్లమిజేసి నిజజనంభారంబునియతిఁజూపి
ధారుణీశ్వరునియాస్థానలేఖలుచూపి ఘనులఁబోషించు మార్గములుదెల్పి
జనులవర్ణాశ్రమాచారసరణులవని, పాలనక్రియలాదిగాఁబరమధర్మ
ములుప్రబోధించి పౌరుషంబులుగణించి, బ్రహ్మనాయునిగుణములు ప్రస్తుతించి 55

మ॥ బలుకయ్యంబులనొప్పి చెందితి జరాభారంబు వ్రేగయ్యెఁ గ
న్నులలోదృష్టికొఱంతయయ్యె నీకవీనుల్ జాడ్యతంబొందె ముం
దలఁగంపంబొదవెన్ మహీవరసభాంతర్వాసదార్ఢ్యంబు వె
గ్గలమయ్యెన్ సుతులార! మీరలె ధరాకాంతుం జగం గొల్వుఁడీ 56

కం॥ ఈయుద్ధమునకుబ్రహ్మ, నాయుఁడులోకైకనుతుఁడు నయకోవిదుఁడ
న్యాయంబొల్లఁడు ధరణీ, నాయకునిం బ్రజలనెల్ల నడపఁగఁజాలున్ 57

వ॥ అని నిశ్చయించి బ్రహ్మనాయునిఁ జూచి. 58

తే॥ "పుత్రరత్నమ! నీ నల్గుభూమిపతికిఁ । గొలువు సేయు"మటన్న నాయలఘుమహిముఁ
డవనిపతి మ్రోలఁ బంచలోహంపు బ్రతిమ । రాజుగంబంబు నిలుపనొక్కరుని బనిచె॥

కం॥ పని వినఁ బరిచారకుఁడుం । జనపతికడ కేగి మ్రొక్కి సచివాత్మజుఁడం
పిన వార్త విన్నవించినఁ । గనుమరులం బిలిచి యట్లు గావించి వెనన్. 60

తే॥ ఉక్కుప్రతిమను దన మ్రోల నునిచి దాని । ముంగలను రాజుగంబంబు మొనయ నిలిపి
రత్నపీఠస్థుఁడగుచు ధరావిభుండు । బ్రహ్మనాయుని బిలువంగఁ బంపెనపుడు. 61

సీ॥ గారుత్మతమణిప్రకల్పితస్వర్ణపల్యంకిక నెక్కి యుర్వంకధవళ
చామరంబులు వీవ జయశంఖరావంబు వీతెంచి వీనులవిందు సేయ
వందిమాగధుల కైవారముల్ మ్రోయంగ వేత్రపాణులు పురోవీథి నడువఁ
బుణ్యాంగనామణుల్ పాలుపొంద దీవింప సద్విజుల్ మంగళాక్షతలు చల్ల
సూర్యదీధితి తనమేను సోఁకకుండఁ । జారుముక్తాఫలామలచ్ఛత్రమమర
ధారుణీశ్వరమందిరద్వారసీమ । దిగి నగరుఁ జొచ్చె నాయుఁ డుద్దీప్తుఁడగుచు. 62

కం॥ ఆయుతభయములన్ నృపతిన్ । బాయక సేవించు వీరభటులుం దొరలున్
నాయకురాలుం గనుఁగొన । నాయుఁడు నతిచేసె ధరణినాథుని మ్రోలన్. 63

కం॥ మ్రొక్కిన రాజుంగంబము । గ్రక్కున ముత్తునియలయ్యె ఘనభుజుఁడు మతిన్
మ్రొక్కిన లోహపుయంత్రం । బక్కొలువున జెక్కలగుచు నవనిం బడియెన్. 64

ఉ॥ మూఁడవసారి హస్తములు మోడ్చిన నజ్జనపాలు వీపునన్
జూడిన భంగి భగ్గుమనుచున్ వెసఁ బుట్టె వ్రణంబు నొప్పిచేఁ
బోడిమి మాలి భూభుజుఁడు మూర్ఛిలెనంత సభాజనంబులూ
టాడుమనంబులం దలఁకి రంబుజపత్రజలంబుకైవడిన్. 55

కం॥ నాయుఁడు నిజసదనమునకుఁ । బోయి సుఖంబుండె నల్గుభూవల్లభుఁ డా
రేయిం దగు నౌషధంబులు । చేయించెన్ వైద్యవరులచే నఖిలంబుల్. 66

కం॥ అది రాజవ్రణమగుటన్ । బోదివిరిసెఁ దామ్రమాడముల గోరియలను
న్మదమునఁ దన్మాంసంబులు । నిదియుదియన కెల్ల మెసఁగు నెమ్ములు చిక్కన్. 67

తే॥ అంతకంతకుఁ దద్ద్రవ్యంబతిశయిల్ల । బ్రదుకుపైనాసలేక భూపాలకుండు
నొప్పిపడలేక భటులచేఁ జెప్పిపంచె । బ్రహ్మనాయునకును సమగ్రంబుగాఁగ. 68

క॥ నాయుండప్పలుకులువిని । డాయంజనుదెంచి నృపతిడగ్గరి "ధరణీం
ద్రా!" యనిపిలిచినవగచుచు । నాయవనీశ్వరుఁడుపల్కె నాయనతోడన్. 69

శా॥ ఈరాజ్యవ్రణభారమెట్టుల ననున్ హింసింప రక్షింపనె
వ్వారల్ వత్తురు రాజ్యమెవ్వరికి సర్వద్రవ్యముల్ నీవ సం
సారంబున్ భరియింపఁజాల నికమోక్షద్వారముందీసి నన్
జేరంబంపుము తత్పదంబునకుఁ జర్చింపం గృపాంభోనిధీ!. 70

ఆ॥ అనిననాయుఁడిట్టులనియె భూవల్లభ! । వ్రణముదెంత దానిగుణముదెంత
క్షణములోనమాన్పి । చక్కఁజేసెదనీకుఁ । గడగబ్రతుకవాంఛగలిగెనేని. 71

వ॥ అనినవిని భూవల్లభుండిట్లనియె. 72

చం॥ ఇలనొకరాజనై నినుఁబరీక్షయొనర్చి వెడంగునైతి వెం
గిలిబ్రదుకొల్ల నీకలుషకృత్యముపాయఁగ నీపదాబ్జముల్
దలఁచుచు నచ్యుతాలయముదారిఁదొలంగక చేరునట్టి నే
ర్పులవడఁజేయవే హృదయమారడిపుచ్చక ధీరమానసా!. 73

ఉ॥ పాపుడఁ గ్రూరకర్ముఁడను భక్తివిహీనుఁడ నొంటిఁబోవఁగా
నోపఁ బదంబుఁజూపనికనొక్కనిబాసటచేసిపంపు నీ
రూపముమానసంబున నిరూపణచేసి భజించి మించి ల
క్ష్మీపతిఁజేరఁబోయెద నిమేషమునన్ భవదాజ్ఞగల్గినన్. 74

ఆ॥ అనినబ్రహ్మనాయుఁడవనీశ! భూపాలుఁ । డొక్కఁడరుగనింక నుచితమగునె
పోయిరమ్ముదొడ్డనాయుండు యుష్మత్ప్ర । ధాని నీకుమార్గదర్శిగాఁగ. 75

చం॥ అనవుడు వ్రేలిముద్రికరయంబునఁబుచ్చి నిజాగ్రనందనున్
గనుఁగొనిచేతికిచ్చి యనఘా! నరసింగధరాకళత్ర! నీ
యనుజులునీవునాయునిమనోంచితవృత్తి సుఖింపుఁ డింక నేఁ
జనియెదనీకుఁజేరఁగ విచారముమానుకుమారశేఖరా!. 76

వ॥ ఇట్లుకుమారుని రాజ్యంబునకుంబూజ్యునిగా నొడంబఱచి 77

తే॥ "బాలమల్లదేవు"లను చిన్నిబాలకులను । బ్రహ్మనాయునిహస్తనీరజములోనఁ
బెట్టి యీపుత్రకులఁబెంపు మెట్టులైన । నీవెగతియనినృపతి కన్నీరునించె 78

వ॥ తదనంతరంబ 79

సీ॥ బ్రహ్మనాయుండుభూమిపతికిమార్గముఁజూపి తనతండ్రికడకేగి ధరణినాథు
నవసానమెఱిగింప నంతకుము న్నార్లగొండరణాంగణక్రూరశస్త్రి
పాతక్షతంబులబాధలుక్రొత్తలై నొప్పిచూపినభ్రాంతి దప్పిమేను
వడఁకుచుండఁగఁ దండ్రి వసుమతీశునితోడఁబోయెదనని చెప్ప నాయుఁడనియె
జనక! నీకుమర్త్యసౌఖ్యంబులు చిదప్పె । మేలుకాలమున నిమేలుకొనుము
చెన్నరాయునాత్మఁజేర్చి పైనముకమ్ము । రాజునొంటిఁబనుపరాదుకాన 80

కం॥ అని చెప్పితండ్రి నందల మునఁజేర్చి మహీశుసముఖమునకపుడె రయం
బునఁదెచ్చి రత్నసింహా । సనమునఁగూర్చుండఁబెట్టి సంరంభమునన్

తే॥ అపుడునలసింగరాజాజ్ఞనవనిసురుల । కన్నగోభూహిరణ్యకన్యాంబరాది
నిఖిలదానంబులొనరించెనెయ్యమెసఁగ । బ్రహ్మనాయుం డుదారసంపన్నుఁడగుచు

కం॥ ఆదొడ్డనాయుడల్లుమ । హీదయితుఁడు "పుణ్యకాలమిది" యని బహుళా
మోదంబులొలయఁజెన్నుని । పాదంబులుమదిఁగలంచిపాసిరితనువుల్ 83

వ॥ అట్టియెడ 84

ఉ॥ వారలకగ్నిసత్క్రియ లవారితశాస్త్రవిధానరీతి సం
స్కారములొప్పఁజేసి రధికప్రియమొప్పఁగ నుత్తరక్రియల్
దీఱఁగసన్మహూర్తమున ధీనిధి నాయుఁడు సర్వధారుణీ
భారమునల్లుభూవరునిపట్టికిఁ బట్టముగట్టె గున్నతిన్ 85

కం॥ నలసింగభూవరుండును । నలధాత్రీశ్వరునిభంగి నాయునికరుణన్
జెలువొందరాజ్యలక్ష్మి । లలనంజేపట్టె జగదలంకారుండై 86

తే॥ బాలమల్లదేవరాజులబ్రహ్మనాయుఁ । డతికృపామతి నఖిలరాజ్యప్రవీణు
లుగనొనర్చె రిపుల్ మదిదిగులునొంద । ధరణిఁబాలించె సర్వస్వతంత్రుఁడగుచు 87

కం॥ నలుఁడు ప్రజాపాలనమున । నలకూబరసన్నిభుండు నవమంజులతన్
నలసింగన్నృపతి దావా । నలుఁ డరిశలభంబులకు ననన్ విలసిల్లున్ 98

వ॥ ఇట్లు సర్వసర్వంసహాభారభరణదీక్షాదక్షదక్షిణభుజాభుజంగుండగు నభ్భూభుజంగుం
డు రాజ్యంబు సేయుచుండి యొక్కనాఁడు 89

కం॥ "భవోర్వరాతలంబుల । నవ్యాహతగతిఁ జరించు నతిభయదములై
క్రవ్యాదమృగము" లనుచు జ । నవ్యూహము మెఱుంగఁ జెప్పినన్ విభుఁ డెలమిన్ 90

ఉ॥ వీటవసించుశూరులును వేత్రధరుల్ దనకొల్వుఁ జేయ నా
ఖేటకవాంఛఁ జేసి పటుఖేటకృపాణములన్ ధరించి పో
రాటలనూటిదప్పనిభటావళి రేమిడి వెర్గగుమ్మడం
పాటిపొలంబుఁ జూపఁ బరిపాటిబలంబులఁ గూడి వేడుకన్ 91

కం॥ తగఁ గోనుమృగముల దెగవేసుఁ । దగిలి ధరావరుఁ డుసుభటులు దండాధిపతుల్
సొగయక సత్వములను రొద । లెగయఁగఁ దెగనతికివ్రైచి రెల్లెడ నడవిన్ 92

తే॥ అంతనాయమరాలుభూకాంతుఁ డడవి । కరిగి వేటాడు మెటిఁగి వనాంతరములఁ
బుడమి తోనికివేసుకఫుప్పె నొక్క । విసిదిరచియించెఁ దగనరగడియలోన 93

పంచపాది.

ఉ॥ అజ్జనపాలకుండు హరిదశ్వసుయూక్షముఁ బొందలంకి యీ
పజ్జకుఁ జేరవచ్చునని పల్లవపుష్పగుళుచ్ఛ నవ్యలా
మజ్జక కాయమానములు మత్తమరాళపత్రతూలపున్
సెజ్జలు రత్నకంబళులు సీధురసంబులు నిర్మలాంబువుల్
మజ్జనభోజనాదుల కమర్చె లతాంగి సమస్తవస్తువుల్ 94

చం॥ తెలినులివెచ్చనోగిరము తియ్యనిచారులు పానకంబు లం
బళులు రసావళుల్ వరలు బజ్జులు తిమ్మనముల్ ఫలావళుల్
గలుపులు పిండివంటలును గమ్మనిమజ్జిగ ఖండశర్కరల్
మలయజచంద్రసార లసమానసుగంధవిలేపనంబులున్ 95

చం॥ క్రమమున ధారుణీశ్వరుఁడు గాంచి ముదంబునఁ బొంగఁ గంటక

ద్రుమములు పంకముల్ విషమదుర్గమభూములు చక్కఁజేసి మా
ర్గమునఁదృణంబులూడ్చి వివరంబులుపూడ్చి కచూరగంధసా
రముల మృగీమదంబుల ధరాస్థలినల్కులు దీర్చిముగ్గి డెన్ 96

ఉ॥ ఏకడనుండివచ్చునో? మహీవిభుఁడెయ్యెడ కేగునింకన
స్తోకమనీష? నంచెదుఱునూచుచునుండెలతాంగి భూవరుం
డాకటడస్సి భాస్కరకరాహతిఁగందినమోముదమ్మితో
జోకదొలంగి దప్పిగొని సుందరిఁజేరఁగవచ్చెఁ జెచ్చెరన్. 97

కం॥ వచ్చిననరవరుఁగనుఁగొని । చెచ్చెరనచ్చపలనయన చేదోయిమొగు
డ్పుచ్చుపడమ్రొక్కి కానుక । లిచ్చి వినమ్రత్వమొప్ప నిట్లనిపలికెన్. 98

మ॥ ధరణీనాథ! భవచ్ఛరీరము దురంతబ్రధ్నతీవ్రాంశుకో
త్కరసంతాపమునొంది కంది వడదాకన్ నిష్ఠురారణ్యభూ
ధరసంచారమదేల? మీరిచట నిత్యస్నానసంధ్యాది భా
సురకృత్యమ్ములుదీర్చి భుక్తిగొనవచ్చున్ సత్కృపాయుక్తిచేన్. 99

ఉ॥ కాలమతిక్రమించెఁ జనగాఁదగదూరికి దూర మింక నీ
వేళమదీయజన్మము పవిత్రతనొందె భవత్కృపాకటా
క్షాలికిఁబాత్రమైతి వినయంబున మీమదిగోరునట్టి యీ
నాలుగుతీర్ల భోజనమునం గడుదృప్తివహింపు మిమ్ములన్. 100

కం॥ అభ్యంతరంబదేల? ధ । రేభ్య! యదృచ్ఛావిహారత నేతెంచితివి
వభ్యాగతపూజలుగొను । మభ్యస్తజనావనాదికాఖిలసుగుణా!. 101

కం॥ దైన్యమున వేడెదను మీ । సైన్యంబులు మీరు తృప్తిసన సాపడి నన్
ధన్యాత్ముఁ జేయఁగా మీ । రన్యులె? మాదృశులఁ బ్రోవనర్హముకాదే? 102

చం॥ అనవిని భూవిభుండు రుచులారఁగ భోజనమాచరించి సౌ
మ్మనమునసంతసించి పలుమారు రసావళులెంచియెంచి సొం
పునఁ గరుణామృతంబు వెలిఁబొంగఁగ నాయకురాలిఁజూచి యి
ట్లనియె భవద్బహూకరణకాత్మఁ జెలంగితి నంబుజాననా!. 103

కం॥ ఎట్టివరమైననీకీ । పట్టునని చ్చెద లతాంగి! భయమొందకు నా
పట్టిగఁజూచెదనినుఁ జే పట్టుమునామాట వికచపద్మదళాక్షీ!. 104

వ॥ అనినఁ నాయకురాలుపల్కె నిజహస్తాబ్జాతముల్ మోడ్చి యో
మనుజాధీశ్వర! సత్యవాక్యనిధి! నీ మర్యాద నేఁగంటి నీ
చనువేచాలు సమస్తముంగలిగె నిస్సందేహ మట్లైని సొం
పున సింహాసనమెక్కఁగోరితి మదిఁ భూమండలంబేలఁగఁ. 105

ఆ॥ ఒక్కజాము పీఠమెక్కని మ్మంతియే । చాలుఁగాన నీదు వ్రేలనున్న
ముద్రికాంగుళీయమును నాకుచిటికెనఁ । బూన్చి కరుణఁజూడు భూపతిలక! 106

వ॥ అనిపలికిన. 107

చం॥ చనువున వ్రేలిముద్రిక యొసంగఁగ బుచ్చినఁ గాంతపల్కె నో
జనవర! యొక్కకాలమున నమ్మతివేడెద నాఁటికిమ్ము నా
కనవసరంపుఁగాలమున నర్హమె? రాజవిభూషణంబు నం
గనలుధరింప మీకొలువుఁగాంచెద సత్కృపనానతిచ్చినఁ. 108

చం॥ అనియొడబాటుచేసికొని యంగనయుఁ ధరణీవిభుండు వా
హనములనెక్కి వేడ్కఁ జతురంగబలంబులతోడఁ బట్టణం
బునకు రయంబునంజని విభుండు యథోచితవృత్తినుండె న
వ్వనజదళాక్షియుం దననివాసముఁజొచ్చె ముదంబునొందుచుఁ. 109

ఉ॥ అచ్చపలాక్షి నిచ్చలు ధరాధిపుఁడుండు సభాంతరంబునఁ
వచ్చుచుఁబోవుచుండి నృపవర్తనమారసి సర్వభూప్రజల్
దెచ్చుకరంబులంగని యిదేసమయంబని నిశ్చయించి లో
హెచ్చినసంభ్రమంబున మహీశున కంజలిమోడ్చియిట్లనుఁ. 110

ఉ॥ సత్యవచోనిధాన! నృపసత్తమ! నీ వలనాఁడు మన్మనః
ప్రత్యయమొప్పనిచ్చినవరం బిపుడీఁదగు భాగ్యభోగ్యముల్
నిత్యమె? పూర్వభూభుజుల నిర్మలకీర్తియకాని వారిసొం
గత్యత నేగ నేపుడమి? క్రమ్మర నేలెడి వారలెందరో? 111

ఆ॥ అనినభూవిభుండు నంగనకిట్లను । ముగ్ధ! సత్యవాక్యమునకు గాదె?
వివిధభోగములనువిడిచిపోయిరి హరి । శ్చంద్ర నలమహీశ శల్యరిపులు 112

కం॥ అవివేకినెకల్లాడంగ?। నువిదరో! కొను ప్రేలిముద్దుటుంగరమని యు
త్సవముననిచ్చిన వ్రేలన్ । దవిలిచికొని పీఠమెక్కెc దరుణి రయమునన్ 113

వ॥ తదనంతరంబ 114

సీ॥ పతులను దండాధిపతుల ననీకినీపతుల రావించి యప్పద్మనయన
పల్నాటిసీవృత్సభానాధులకు భీతిగలుగ నాజ్ఞాపత్రికలులిఖించి
వరలుబ్రహ్మక్షత్ర వైశ్యశూద్రాంత్యజ ప్రభృతి కాష్టాదశ ప్రబలవర్ణ
సమితిమందిరముల సర్వస్వముల్ గొనితెండీక్షణంబున నొండనాక
జాగుసేయరాదు సందిగ్ధపడరాదు । పోదుమింకననుచు బొంకరాదు
ముఖ్యజనులటంచు మోమోటపడరాదు । పలుకువిననిభటుండు బ్రదుకరాదు 115

కం॥ అనుచునిజాజ్ఞాపత్రిక । లను మును వ్రాల్చేసి నిష్కళంకతఁబనుపన్
జనిభటు లాజనపదముల । ధనవంతులమందిరములఁ దార్కొనిబలిమిన్ 116

కం॥ అంగనలమెడలఁగట్టిన । మంగళసూత్రములుదక్క మందిరములమే
నం గలభూషణములు ధన । ముఁగదనొదవంగ దెచ్చి రరజామునకున్ 117

తే॥ తెచ్చిశ్రీరామమాడలు దీప్తి వెలయ, ధర్మసింహాసనోభయ పార్శ్వములను
రాశిఁబోయఁగ నాయకురాలు తొంటిని, లెక్కలకునెక్కుడైన యార్థొక్కమరసి

కం॥ నలసింగభూమిపతికై, యెలనాగజొహారుచేసి యేలినవారికిన్
గొలిచివివరించెదను నా, పలుకాలింపుండు భూమిపాలనచతురా! 119

కం॥ మెుక్కఁదగ బరాకు కవిలియు, లెక్కలక గ్గలముగాఁగ లెక్కింపుచు మీ
రొక్కముభాండాగారము, పిక్కటిలంబోయఁబంపు పృథివీనాథా! 220

మ॥ నను నీమ్రోలఁ బ్రధానిగానిలిపి సన్మానంబునంజూచి నా
యుని సంక్షేపముచేసితేని భవదీయోదాత్తరాజ్యంబు స
జ్జనసేవ్యంబగు మందిరం బభినవస్వర్ణాబ్జరాగప్రక
ల్పనలన్ మించినకుడ్యసంతతులనొప్పంజేయనే? భూవరా! 221

శా॥ నీమాటల్ వినినట్లయుండియును భవన్నిత్యప్రతాపంబు శ్రీ
డామాత్రంబుగఁజూచు మెచ్చఁ డతిమూఢస్వాంతుఁ డెల్లప్పుడున్
స్వామిద్రోహముఁజేసి రాజ్యమున సర్వద్రవ్యముల్ దానె మా
యామూలంబుననిల్లుచేర్చుకొని బ్రహ్మనాయఁడు దుర్వీశ్వరా! 122

ఆ॥ ఇతఁడుసచివుఁడనుచు నేమఱి సర్వస్వ, తంత్రమిచ్చి యొఱుకఁదప్పినారు
భావికార్య మాత్మభావించుకొనుఁడు న, న్నాడుదనుచు సెంచ కవనినాథ! 123

కం॥ నిక్కమిపుడేను దెచ్చిన, మిక్కుటపుధనంబు లెక్కమిగిలి వెలయు నా
రొక్క మే కేటనాయెం, డుక్కునఁగొనెననుచు బుద్ధినూహింపుఁడికన్ 124

ఆ॥ పలుకులేలయింక "బాలాదపిసుభాషి, తం" బటంద్రుకాదె ధరణినాథ!
యబలననుచున న్ననాదరంబునఁజూడ, కఖిలశాస్త్రవేది! యఘవిభేది! 125

చ॥ అననలసింగభూమివిభుఁ డంగనబోధలఁజిక్కి బ్రహ్మనా
యుని మదినాదరింపక ప్రియోచితవృత్తినడంచి తత్సభా
జనసదృశస్వభావునిగ సారెకుఁజూచిన నమ్మహాత్ముఁ డా
ప్పనిజననాథుఁజూడఁగ నపౌరుషమంచుఁదలంచి యోర్చునన్ 126

ఉ॥ నాథుఁ డనాదరంబున దినక్రమణంబునకిచ్చునట్టి నా
నాధనధాన్యవస్తువసనంబులుమాన్పిన నిత్యజీవనో
పాధికిఁ గిన్కనొందక విభావసుతేజుఁడు నాయఁ డాత్మ సం
బోధితమానసుండగుచుఁ బూర్వపులెక్కలుచూచి వేడుకన్. 128

కం॥ తనజనకుఁడు ధనికులకిచ్చిన యప్పులుదెచ్చి నిత్యజీవనమున కం
పినఁ జాలదేమహాధనమని వేడుక నార్లగండికరిగి రయమునన్ 128

తే॥ అరిగిధనికులనందఱినరసి భటుల । నంపిపిలుపించి వృద్ధిమూలంపుధనము
చాలశకటంబులను గురిజాలపురవ । రంబునకుఁ జేర్చుచుండు నిరంతరంబు. 129

కం॥ అచ్చటనాయకురాలిన్ । మెచ్చిప్రధానత్వమిచ్చె । నృపుఁ డది తనలో
హెచ్చినపరితోషంబున । విచ్చలవిడి ప్రజల వేధపెట్టుచునుండున్. 130

ఆ॥ బ్రహ్మనాయునింట బాలమల్దేవులన్ । నృపకుమారకులు వినీతిమెఱసి
సాము నేర్చుచుండఁ జని కాంచి నాయకు । రాలు పుట్టుగొడ్డురాలుగాన. 131

కం॥ మాయోపాయంబులచే । నాయునికన్నొఱఁగి వీరి నశియింపంగాఁ
జేయందగుననిమనమున । నాయకురాల్దలఁచె నిట్టి దాయమకరుదే? 132

ఆ॥ బాలురనుచు నెత్తి పలుమారుముద్దాడుఁ । బ్రభుకుమారులనుచు భక్తి సేయుఁ
జిత్తమునను వారి శిక్షింపఁగాఁజూచుఁ । గాంత తేనెపూతకత్తిగాదె? 133

కం॥ కలఖండ మిక్షుఖండం । బులు తేనియ నారికేళములు ఖర్జూరీ
ఫలములు ముమ్మాగ బాలకు । లలవడనిప్పించు విద్యలరయుచునుండున్. 134

మ॥ పురకాంతల్ విహరింపఁగని యాపూబోడి శ్రీవక్షోరుహాం
తర మొప్పం గురివేసి కంచుకములందాకంగవైపించు భా
సురభూపోపవనప్రవర్ధితకుజక్షోభంబుఁజేయించు బా
లుర చేనిచ్చలుఁ దత్కుచేష్టలను సుల్కుంబట్టణం బెంతయున్. 135

వ॥ మఱియును. 136

ఆ॥ నృపకుమారులార! నేర్పుఁజూతము వాలు । గంటు లెత్తితెచ్చి కడవలకును
జిన్నిబాణములను జిల్లులుపుచ్చి పై । నతుకుఁడింక మైనమంటియుండ. 137

మ॥ అని ప్రేరేపి రచింపఁ దత్కుటిలకృత్యంబుల్ మహీభర్తకున్
వినుపింపం దరహాసవక్త్రుఁడగుచున్ విశ్వాసమొప్పార న
మ్మనుజేశుండు లతాంగితోనను సధర్మంబానె? తద్బాల్యవ
ర్తన ముత్ప్రేక్షయొనర్ప నేటికి? నితాంతప్రాజ్ఞులే బాలకుల్? 138

వ॥ అని నిరంత దురంతకుటిలబోధావిధాననిధానయగు నాయకురాలిపలుకుల కులుకక
నలసింగమహీపాలుండు. 139

సీ॥ ప్రాతరాహ్నికమునఁ బరమేశు సేవించి మోముదమ్మిని బుండ్రములుధరింప
రత్నకేళివిహార రాజంబుసతతంబు ధరణీశునకు నెండదాకకుండఁ
బక్షముల్ చాటుగాఁ బట్టుచుండఁగఁజూచి నాయకురాలొక్కనాఁడు దుష్ట
రాలయి మల్దేవరాజసూనుల కప్పతంగపుంగవుఁజూపి ధరణినాథ

తనయులార! మీరుదాని ఱెక్కలు ఖరఁ । గూల్చవేయు మీరకుంఠబలులు
బాణములను దానిభంజింపలేకున్న । బిఱికిదొరలటంచుఁ బేరువెలయు. 140

చం॥ అనవుడు నందు నగ్రజుఁ "డహా! పతగాధిపు నేయుటెంత మే
ల్పని" యని చాపమెక్కిడి విలాసమెలర్ప వెడందవాతి య
మ్మునఁబడ నేసె నేలఁబడ మున్నునరుం డొగి మత్స్యయంత్రమున్
దునియఁగ నేయుచందమునఁ దొరపువిక్రమ ముప్పతిల్లఁగన్. 141

కం॥ ఱెక్కలుదెగి నేలంబడు । పక్కింగనుఁగొనుచు భూమిపతి కోపమునన్
జిక్కి నలుదిక్కులారయు । నక్కలుషపు వెలఁది యిట్టులను నగపతితోన్. 142

ఆ॥ మనుజనాథ! యెన్నిమార్లు నేఁజెప్పిన । మాటలెల్ల నీటిమూటఁజేసి
తమ్ములనుచువారి ధర్షింపవెన్నఁడు । తమ్ముఁడెనక ననుచితమ్ముగాదె? 143

చం॥ "ఘనతఁబరోపకారవిహగంబది దానివధింపఁగూడ దో
జనపతిసూనులార!" యనిచాటితి మీపయి నానవెట్టితిన్
జనువున బుద్ధిసెప్పితి మృషావచనంబుల కక్కుమారకుల్
మనమున భీతిఁజెందుదురె? మాపృథకాంతలు వారికడ్డమే? 144

ఆ॥ పులుగుఁజంపిరింక భూమీశ! మావంటి । జనము లెందఱింకఁ జచ్చువారొ?
యేనుఁగులను మ్రింగు నేఱ్ఱెలకిటువంటి । పీనుఁగులు గణింపఁబిండివంట. 145

వ॥ అని పలికిన భూవల్లభుండు కోపసంరక్తనయనయుగుఁడగుచు నాయువరాలికిట్లనియె. 146

కం॥ అణుమాత్రము శంకింపక । ప్రణములఁ దెగఁగోసి వైద్యవరుఁడు తనువులన్
గుణమొందఁజేయుంగతి నీ గుణహీనులఁ ద్రుంచి మనుపు కువలయమెల్లన్. 147

కం॥ పాటలగంధిరో! వినుము । మ్మాటికి నీచెడుగు నృపకుమారుల జనముల్
పాటించిచూడకుండెడి । చోటన్ వధియింపవలయుసుమ్మీ యనినన్ 148

ఆ॥ మంచికార్యమనుచు మానిని తనమంది । రమున నొక్కపేటి రచనచేసి
యందుబాలకులను బొందించి భటులచే । నగ్గినిడఁగఁబంచె నడవిలోన. 149

కం॥ ఆయత్నమెల్ల బ్రహ్మకు । నాయుని జననియు నెఱింగినది గావున లోఁ
బాయనిదయాగుణంబున । సాయంకాలమున గూఢచారులఁబంచెన్. 150

నీకము నీదుగర్భమున నిశ్చలసౌఖ్యమునన్ వసించునే?

కం॥ నాతనయ నిరతసాధు స। నాతనయతివినుతిఁగాంచునాకతటిని వి
ఖ్యాతనయ నిన్నుఁగొల్చెఁగ। దా? తనయనఘ ప్రసక్తిఁ దనరినభక్తిన్ 21

కం॥ నుడివితివేమేమో మము। వెడగుల బడుగులను బ్రోవవేయని పెక్కుల్
దొడఁబడనవు డేమీ నీ। వెడగుతనము బడుగుతనము విను వివరింతున్ 22

తే॥ సమతనాశ్రితబహుజంతుసంతతులకు। సంతతము జీవనము యథేష్టముగ నొసంగి
గుణగభీరత గోత్రరక్షణ మొనర్చు। వెడగుతన మెల్ల నీయంద వెలసెఁగాదె? 23

కం॥ ఈనాకజనపతి గజ। దానము నమరులకు నన్నదానము మఱి గో
దానము నొసఁగినబడుగువ। నూనత శ్రీమూర్తిదాన మొసఁగవె? నాకున్ 24

కం॥ ఇంటం దగుభాగీరథి। వంటి గృహిణి చందమామవంటి కొడుకు శ్రీ
వంటిసుత గలిగి మను నీ। వంటిసముద్రునకు సరియొవరు గృహమేధుల్ 25

తే॥ ధృతిని మముబోంట్లవాంఛలుదీర్పఁజాలు। సిద్ధసంకల్పునకును వాంఛితముగలదె?
యైన నొసఁగెదవేదు మేమైన వాంఛ। గనకగలిగిన నిందిరాజనక! యనిన 26

కం॥ విమలాంతఃకరణుండగు। కమలాజనకుండు నిటలఘటితాంజలియై
కమలాక్షునకిట్లనె నా। గమలాలితచరణ! నీదు కరుణాదరణన్ 27

కం॥ సేమమున సర్వదా మనఁ। గా మము నీవరసి ప్రోవఁగా మఱిమాకున్
స్వామినిరంతరమును బరి। ణామమె కాకితరవర్తనంబులుగలవే? 28

గీ॥ అరుణశశినేత్ర! మామీఁదికరుణతోడ। నొసఁగి సిరులెల్ల మాకు నీ వొసఁగినదియె
మితముతే కెప్పుడవియె కామితములెల్ల। నొదవఁజేయుంగ నేమిటఁగొదువ మాకు

కం॥ ఈరికలెత్తిననామదిఁ। గోరికమఱియొకటిగలదు గుణరత్ననిధీ
చేరిక మీయానతి కవ। తారిక గా విన్నవింతుఁ దగ వినుమనుచున్ 30

కం॥ వాణీశశర్వాణీగీ। ర్వాణీవేణీనిబద్ధ రమ్యణీయమణి
శ్రేణీఘృణిశ్రీనీరాజిత। శోణితపదపద్మ నపుడు చూపి ప్రియోక్తిన్ 31

మ॥ శ్రితరక్షామణి! యెల్లవారువిన నే శ్రీమూర్తిన్ దానంబుఁ జే
సితినీకంచు గణించి తట్టిపలుకుల్ శీర్షంబుగాఁజేసి నా
సుతయౌ శ్రీవనితన్ మదీయగృహముల్ శోభిల్లఁగల్యాణ సం
గతిచేఁగైకొని నామనోరథము సాకల్యంబుగాఁగూర్పవే. 32

కం॥ శ్వేతద్వీపముగలదిట । నీతిద్విపరథభటాది విహారణమున సు
ద్యోతితవిస్తారంబై । యేతద్విభవార్థమగుచుని దేనాయందున్. 33

కం॥ కావునవచ్చటనగరముఁ । గావింపననుగ్రహింప గరుడధ్వజ! మీ
వైవాహికశుభమునకిర వైవాహినిఁగాంచు నదియు నని ప్రార్థింపన్ 34

కం॥ ఇందిర నరవిందవనీ । మందిర నతినీలకచసమాజక్లాంతేం
దిందిర నీక్షించి సుధా । స్యందిరవం బెసఁగ హరి త దనుమతిననియెన్ 35

గీ॥ వారిజారాతిజనక! యోవారిధీశ ! వేడుకనుమాయభీష్టంబు వేడుకొంటి
వింతయొప్పన? యీమాట వింటిరుచుల ॥ నర్థి నాలాగె నేను గన్యార్థినగుచు. 36

కం॥ ఇప్పడతుక నతివిభవము । జొప్పడఁ బెండ్లాడి సకలశోభనములచే
నుప్పతిలసిరులఁ దనరుచు । నప్పతి! నీయిల్లిటంపు టల్లుఁడనగుదున్. 37

తరల॥ అని యనూనగతిన్ రమాపతి యానతీయ దయాళుఁడై
యనియనూనమటంచు ధన్యుఁడనై తినంచు శుభప్రధా
ననియతిన్ ఫలియించె నా జననంబటంచు ముదంబుతో
న నియతస్థిరభక్తిఁ జక్రికి నబ్ధి మ్రొక్కె సుదారుఁడై 38

మ॥ వనజాతేక్షణుఁడంత హర్షమున విష్వక్సేను వీక్షింప న
ర్థి నతండున్ దదనుజ్ఞఁ గైకొని సితద్వీపంబునం దాత్మకాం
చనవేత్రాగ్రమునన్ సృజించె రహి మించన్ సర్వసంపత్సమ
గ్రనివాసంబగు రాజధాని విలసత్కౌశల్య సంధానియై 39

సీ॥ ఏవాడఁజూచిన నేపారుశశికాంత శశికాంతవేదికాసరసరాజి
యేవాడఁజూచిన రాజిల్లుసురసాల సురసాలతరువన స్ఫురితపంక్తి

యే మేడఁ జూచిన శ్రీమించు నిభరాజి నిభరాజసుతకళా విభవకేళి
యేప్రోడఁ జూచిన నింపొందు ఘనసార ఘనసారసామోద కలితరీతి
యచటికోటలు పేటలు నలరుఁదోఁట । లచటిచిన్నెలు వన్నెలు ననుఁగుఁగన్నె
లచటిశుకములు పికములు నలులరకము । లేమనఁగవచ్చు నగవచ్చు నెంతుమనిన.

మ॥ కమలానాయకు మెచ్చఁజేయుటకుఁ జక్రం బిప్పురిన్ సాలచ
క్రముగాఁ బోలు నిజాయుతోరుపటుధారల్ కొమ్మలై కమ్మ ని
క్కముగాదేని సుదర్శనోచిత మహత్త్వంగాంచి తేజోమయా
గ్రిమమై నిర్మలపాంచజన్యపరమైత్రిన్ సర్వదా మించునే? 41

చ॥ ఉరుతరభూతి భోగులకు యోగులకున్ మహదాశ్రయంబులై
పరఁగ ననేకదేశగుణభావ్యులు మీరలు నానమానులే ?
ధరనని యాక్రమించుగతిఁ దద్భవనంబులు చుట్టుముట్టఁ బెం
పరయఁగ సాలమూలమున నగ్రమునన్ నగరం బుదగ్రమై. 42

మ॥ సముదారోన్నయ పేయతోయ విలసత్సౌవర్ణ నాళీకనా
ళము లచ్ఛోదగు కోటపాదుఁబడి లీలం డిగ్గి పాతాళలో
కములన్ వ్రేలఁ దదీయవాసు లచటన్ గాంక్షించి డోలావిహా
రము గావింతురు తత్పరీమళసమీరగ్రాసబద్ధాశలన్. 43

చ॥ ఘన మణిగోపురాగ్ర విహగప్రభుకేతువుఁ గాంచి భీతిచేఁ
జనుఫణిరాజరజ్జువులు సారె రథాశ్వములం దగిల్చి ప
ట్టణమున నివ్వ లవ్వల హుటాహుటి నర్కుఁడు పోవ దక్షిణా
యనమును నుత్తరాయణము నాఁ దగెఁ దద్గతు లిప్పుడున్ దివిన్. 44

చ॥ అలఘు కళాసమగ్రత ననంతపదాభిరతిన్ జెలంగ మం
గళగురుసౌమ్యసౌర్యరుచికాంతసభావళి రాజరాజహం
సులకు విహారయోగ్యమనుచొప్పున నప్పురి సూర్యసోమవీ
థులు జెలువొందుఁ దన్మహిమతోఁ దులతూఁగు విచిత్రవైఖరిన్. 45

ఉ॥ శ్రీవిలసిల్లు క్రొంబసిడి చిత్తరుమేడలయం దనేక తా
రావళి యింపుతోఁ గువలయస్ఫుటవాసనలం దనర్చు శ్యా

మావిలసద్విలాసము లదుందగతిన్ గనిమర్లుకొన్నయా
కైవడిఁజుట్టిఁబెట్టు శశికాంచనసాలముచుట్టునచ్చటన్ 46

ఉ॥ తోరపుసంపదన్ బురి చతుష్పథమధ్యమునందుఁబొల్చు శృం
గారపు మేడయొక్కటి యఖర్వగతిన్ జలరాశిఁద్రచ్చుఁజే
కూరినదాట శౌరిదయకున్ దగి ముజ్జగమెన్నఁ దన్మహా
గారమునన్ బ్రతిష్ఠగనఁగావసియించిన మందరంబనన్. 47

చ॥ ప్రమదలు వీటిసౌధములపై నిక టాభ్రసరిత్సువర్ణకం
జములనుగాంచి "యాత్మరుచిసౌరభముల్ గొనుమ్రుచ్చు లంగమం
చెములివె" యంచుచాటు నతిచిత్రగతిన్ విపులించి కేశపా
శములనుగట్టివైతు రతిఝుంకృతులన్ మొరవెట్టబెట్టుగాన్. 48

శా॥ ద్వీపంబొక్కటి శ్రీమనోహరునకున్ వీడై యమోఘాకృతిన్
జూపట్టన్ దమదీర్ఘతల్ వృథయటంచున్ జింత నాద్యక్షర
వ్యాపారోచ్ఛ్రయ ముజ్జగించి యుచితంబర్థించి భ్రాంతేతర
ద్వీపంబుల్ విధియాజ్ఞచే ద్వీపములై విఖ్యాతిమించెన్ రహిన్ 49

శా॥ యాదోరాశిమథింపుచో జలజగేహావిర్భవప్రాప్తియం
దాదిం దా ననురాగవృత్తిఁ దగి తత్ప్రారంభనీతార్ష్యకే
ఖాదంతంబుగ నుజ్జ్వలద్గతిఁ దరంగంబుల్ తురంగంబులై
సౌరుల్ మెచ్చఁగఁ దేజరిల్లునచటన్ జారుధ్రువాలంకృతిన్. 50

ఉ॥ టెక్కెలుచక్రముల్ బసిడిరేకులుకమ్ములు మావినిర్ఘరుల్
టెక్కియముల్ పటంబులు గుటీరతతుల్ బగడంపుఁదీవియల్
చక్కని త్రాళ్ళుగాఁ బురినిసాగరగుప్తగిరుల్ రథంబులై
గ్రిక్కిరియన్ మురారినరిగెన్ హరి జిల్వకుఁబిల్వఁగావలెన్. 51

చ॥ నిరతము సాధ్వియైనగృహిణిన్ దలవాకిటనుంచి బుత్రు మం
దిర మునబుద్ధిఁ బెంచ కతినింబలుఁజివ్వలఁ దిండిఁ జేసితా
నురుతరసత్రభోక్తయయి యోగియు భోగియు గానిబ్రింహ్మ నే
వెరవున మెచ్చ రప్పురమువిప్రులు నీతికశాసనుగ్రితన్. 52

25 వుప్పలపాటి వెంకటసుబ్బయ్యగారు, కరణం వుప్పలపాడు
26 గోరంట్ల పున్నయ్యగారు, డిటో.
27 మొదకు శేషారావు దేశముఖుగారు. నల్లబల్లి.
28 చింతలచెర్వు గోవిందరెడ్డిగారు, గ్రామమునసబ్, చంద్రాజుపాలెం

ఈ నెలసొమ్ము చెల్లించినచందాదార్లు

1 పుచ్చాపట్టాభిరామయ్యగారు, తుమ్మలచెర్వు
2 అధరాపురపు బుకుషోత్తమాచార్యులుగారు, నరసరావుపేట
3 బెల్లంకొండరంగారావుగారు, పమిడిపాడు
4 ఈరామకృష్ణరావుగారు, డిటో
5 ఈరామచంద్రరావుగారు, కరణం డిటో
6 దమ్మాలపాటిచినవెంకటరావుగారు, దమ్మాలపాడు
7 వేలమూరిఅంజనేయశాస్త్రిగారు, నరసరావుపేట

## GEMS FROM BHAGAVAD GITA
## భగవద్గీతారత్నములు.

శంకరభాష్యార్థసహితముగ నింగ్లీషర్థముఁజేర్చి మృదుమధుర శైలితో ముద్దులుమూటగట్టునట్లు 125 పేజీలతో మంచిబయిండు చేయఁబడినది. వెల 0-2-0


వలయువారు మాకువ్రాసుకొనవలయును

తాటికొండరామకృష్ణారావు
నర్సరావుపేట

## సావిత్రి

ఇది పులుగుర్తిలక్ష్మీనరసమాంబచేఁ బ్రచురింపఁబడెడి యొకమాసపత్రిక. ఇందు స్త్రీధర్మములు చక్కఁగా నుపన్యసింపఁబడుటయే కాక మంచిమంచిగ్రంథములును బ్రచురింపఁబడుచుండును, ఎడిటరు. స్త్రీవిద్యకు యీపత్రిక విద్వత్ప్రశంసనీయమైయున్నది. ఇదియునుమా కార్యస్థానమలంకరించుచున్నది. చందాసం॥రు1-0-0

వలయువారు కాకినాడకు వ్రాసుకొనవలెను.

ప్రధాన పోషకులు.

1 శ్రీశ్రీ జగద్గురు విరూపాక్షస్వాములవారు.

పోషకులు.

1 తాడేపల్లి లక్ష్మీనరసింహారావుగారు, ముక్తాదార్, చోళ్లేరు.
2 పులిపాక పూర్ణయ్య పంతులుగారు, వకీల్, నర్సారావుపేట.
3 రంగావఝ్ఝుల హనుమయ్యగారు, జిల్లాకోర్టువకీలు, గుంటూరు.
4 తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణం, దుగ్గిరాల
5 రామసింగుగారు, నెల్లూరు.
7 పోతేపల్లి రాజేశ్వరరావు, దేశముఖుగారు, పెద్దపల్లి.
8 దేవరాజు మురళీధరరావుగారు, వ్రాదెల.

## 'గిరప్రపము.'

ఇందు 1 ఈశ్వరసేవలు, 2 శిల్పబంధు, 3 మేలుబిగింపు, 4 శాంతింపు, 5 మందలింపు, అనగు పర్వములు గలవు. అన్నిటిలో 5 వ పర్వము పెద్దది. 2, మాసములలో శమూరగును.

దీనివెల రు 1-0-0 మాత్రము.

వలయువారు,
చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి, శతావధాని,,
భైరవప్రస్సు, బందరు, అని వ్రాయవలెను.

## 'కామేశ్వరి.'

ఇది సంచికలబడి పుటలసంఖ్యను చెన్నపురిలో ప్రచురింపబడుచుండును. ఇందు సంగ్రహముగా దళము వెంకటరామకృష్ణకవులకు శిష్యుమువి మర్శింపబడుచుండును చందా సంవత్సరమునకు రు 2-0-0 లు.

వలయువారు:—పత్రికాధిపతులగు పురాణం సూర్యనారాయణ తీర్థులు,
19 వ నెం॥ ఇల్లు గోవిందప్పనాయనివీధి, చెన్నపురి. అని వ్రాయవలెను.